శ్రీరామ

# శ్రీ కుమార శతకము.

ఇది

గీర్వాణాంధ్రభాషాకవితావిశారదులును,

నీతికళాబృహస్పతులును నగు

మహారాజరాజశ్రీ

## రావు భాస్కరరాయనింగారిచే

సంస్కృతమున రచియింపఁబడి,

శ్రీమత్పీఠికాపుర సంస్థానాస్థాన కవీశ్వరులగు

బ్రహ్మశ్రీ

దేవులపల్లి సుబ్బరాయ శాస్త్రులవారిచే

నాంధ్రీకరింపఁబడి

మహారాజరాజశ్రీ

శ్రీరాజా రావు చెల్లయ్యమ్మారావు బహద్దరు జమీందార్

తాలూకే కోలంక, వీరవరము, వగైరా వారి యాజ్ఞానుసారము

వారిముఖ్య యేజంటగు

శ్రీ కొత్తపల్లి వేంకట పద్మనాభ శాస్త్రిచే

ముద్రింపించి, ప్రకటింపఁబడియె.

శోభకృన్నామసంవత్సర శ్రావణశుద్ధ [illegible] స్థిరవారము.

1903 సం|| ఆగష్టు నెల 1 వ తేది.

*Copyright Registered.*

శ్రీరామ

# శ్రీ కు మా ర శ త క ము.

ఇది

గీర్వాణాంధ్రభాషాకవితావిశారదులును,

నీతిశాస్త్రబృహస్పతులును నగు

మహారాజరాజశ్రీ

## రావు భాస్కరరాయనింగారిచే

సంస్కృతమున రచియింపఁబడి,

శ్రీమత్పిఠాపుర సంస్థానాస్థాన కవీశ్వరులగు

బ్రహ్మశ్రీ

దేవులపల్లి సుబ్బరాయ శాస్త్రులవారిచే

నాంధ్రీకరింపఁబడి

మ హా రా జ రా జ శ్రీ

శ్రీరాజా రావు చెల్లయ్యప్పారావు బహద్దరు జమీందార్

తాలూకే కోలంక, వీరవరము, వగైరావారి యాజ్ఞానుసారముగ

వారిమిత్రులును యగుటను

క్రొత్తపల్లి వెంకట పద్మనాభ శాస్త్రిచే

ముద్రింపించి, ప్రకటింపఁబడియె.

శోభకృన్నామసంవత్సర శ్రావణశుద్ధ ౯ స్థిరవారము.

1903 సం॥ ఆగష్టు నెల 1-వ తేది.

*Copyright Registered.*

శ్రీరామాయనమః.

# ఉపోద్ఘాతము.

శ్రీకుమారశతకమను నీగ్రంథము రేచర్లగోత్రులును, విద్వత్సంస్థానంబని చిరకాలంబుగఁ జేరెన్నికగన్న శ్రీపీఠికాపురిసు జమీందారులును మహారాజరాజశ్రీ శ్రీ రాజా రావు వేంకట మహీపతి గంగాధరరామారావు బహద్దర్ జమీందారుగారి యౌరసపుత్రులును, ప్రకృతము కౌమారదశయందుండువారును నగు మహారాజరాజశ్రీశ్రీ రాజా రావు వేంకటకుమారమహీపతిసూర్యారావు బహద్దరు జమీందారుగారిని సంబోధించి మహారాజరాజశ్రీ, రావు భాస్కరరాయసంగారు రసుకవులు చెప్పిన రాజనీతిబోధకములగు నూఱుసంస్కృతశ్లోకములుగలదై యున్నది. కులవృద్ధగౌరవముచేఁ గృతిపతులను గిపిగారు 'కుమార' యని ప్రతిశ్లోకంబున సంబోధించుటచే నీకృతికిఁ గుమారశతకమను నామధేయ మిడంబడియె.

ఈగ్రంథమునకుఁ బీఠికాప్రాయమైన 'రామధాటీశ్లోకంబు' లను పేరుగల యిరువదియొక్క శ్లోకంబు లేతత్కవికృతంబు లిందుఁ బొందుపఱుపఁబడియున్నవి. ఈ శ్లోకంబులందు వెలమవంశమౌక్తికాయమానమైన రావువంశముయొక్క ప్రశస్తియుఁ, దద్వంశ్యప్రభావంబును, గృతిపతుల మాతాపితృనగరాదుల మహిమానుకథనంబును, గృతినేతల వైదుష్యౌదార్యగాంభీర్యాద్యుత్తమనాయకగుణగణముల స్తవంబును గలవు. ఇయ్యవి సమదారి హృదయ నిర్భేదన పటిష్ఠ పరశురామధాటీ

సంఖ్యాకంబై పరనృపాల మదవిదారణ శీలంబగుట రామధాటీశ్లోక
ప్రథగనియె.

ఏతద్గ్రంథకర్తలు మన యంధ్రమండలంబునఁ బ్రభుత్వాది
గౌరవ పాత్రంబై ప్రసిద్ధంబగు వెలమవర్ణంబను ఖ్యాతిచేమించుచున్న
పద్మనాయక వర్ణంబునందు రేచర్లగోత్రంబున రావువారికుటుంబములోని
వారు. వీరినివాసస్థానము గోదావరీమండలములోని పీఠికాపురరాజ్యంబు
నందలి పండూరను గ్రామము. వీరితల్లిదండ్రులు శ్రీవెంకయమ్మగారు,
రామరాయనింగారు. వీరి కిప్పు డించుమించుగ 72 - సంవత్సరముల
వయస్సుగలదు. శ్రీకుమార శతకమును 1897-వ సంవత్సరము ఆగస్టు
నెలలోఁ బ్రారంభించి సెప్టంబర్, అక్టోబర్, నవంబర్ నెలలలో వ్రాసి
1898-వ సంవత్సరము ఫిబ్రవరినెలలోఁ గృతినాయకుల కొసంగిరి.
మఱియును బైనుదాహరించిన రామధాటీశ్లోకములను నైదాఱువాస
రంబుల రచియించియుంనారు. వీరు విశేషముగ స్మర్తలు, మిక్కుటంబగు
సంస్కృతసాహిత్యమును, జొక్కుటంబగు నాంధ్రభాషా వ్యుత్పత్తి
యును, గలవారు. వీరికిఁ బ్రక్రియాకౌముదియుఁ బ్రకరణాంతము
తర్కశాస్త్రమును గురుశుశ్రూషాపూర్వక పఠితోపపన్నములు గావున
నివి వీరికిఁ దగినంత యుపస్థితిలోనున్నవి. వీరు నలువదిసంవత్సరముల
ప్రాయమువాఁడు సంస్కృతమున నద్వైతసారమను నొకగ్రంథమును
వ్రాసిరి. అది 100-120-శ్లోకములుగలది. వీరాంధ్రగీర్వాణభాషలలో
నిర్దుష్టకవితారచనయందుఁ దత్ప్రాంతంబునఁ బ్రసిద్ధికెక్కియున్నారు.
వీరింతవయసు మించినవారైనను, విద్యావ్యాసంగములను, విద్యాగోష్ఠు
లను, వీరిప్రతిభ నిరర్గళముగనున్నది. వీరికి మన్వాదిస్మృతులును, మ
త్స్యాది పురాణములును, గామందకాది నీతిశాస్త్రములును, బహువార
పఠితపరిశీలితములుగావున వీరికిఁ దత్సంప్రదాయములు సువిదితములన్ను

టకు శ్రీకుమారశతకమే తార్కాణము. వీరూర్ధ్వపుండ్రధారులయినను వీరికూటస్థపురుషులగు రుద్రాదిత్యబేతాళరాయ సర్వజ్ఞ సింహభూపాలాదులవలె నద్వైతసిద్ధాంతాభిమానమును, శివకేశవైక్యనిశ్చయజ్ఞానమును, స్మార్తాచారనిష్ఠయు, దేవబ్రాహ్మణభక్తియుం గలిగి యౌద్ధత్యరహితులయి నీతిశాలిత్వముతోఁ గూడి యత్యంతలోకసన్మానార్హప్రవర్తనగలవారుగ నున్నవారు. వీరికవిత మిక్కిలి ప్రౌఢము. గంభీరవాగ్గుంభితము. మృదుశైలిజృంభితము. వీరిప్పుడు వారిస్వగ్రామంబున యోగపాతంజలాదిపారమార్థికగ్రంథకాలక్షేపతత్పరులై యున్నవారు.

శ్రీకుమారశతక, రామధాటీ శ్లోకముల భావంబించుకయేనియుఁ బొరపడకుండ శ్రీమత్పిఠాపుర సంస్థానాస్థాన కవీశ్వరులును, శతావధానులును, నాశుకవితాధురీణులును, నుభయభాషాపాండిత్య కవిత్వవిరాజమానులును, రావువంశముక్తావళ్యాదిగ్రంథకర్తలును నగు బ్ర॥ శ్రీ, దేవులపల్లి సుబ్బరాయ శాస్త్రులుగారు తెనుఁగుబద్యములను, టీకాతాత్పర్యములను రచియించిరి.

మహాకవివిరచితమై, సర్వశాస్త్రసమ్మతమై, సకలనీతిశాస్త్రార్థసారభూతమై, నిజాగ్రజాతాంకితంబైన యీ గ్రంథంబుఁజూచి 'పకస్స్వవచనఘంటీత' యను న్యాయమ్మనుసరించి ప్రజారంజన మూలంబుగ నైహికాముష్మిక ఫలంబులంగోరు ప్రభుకుమారుల కండఱకు మిగుల నుపయుక్తమని యోజించి లోకోపకారైక తత్పరయగు మహారాజరాజశ్రీ, శ్రీరాజారావు చెల్లాయమ్మారావు బహద్దరు జమీందార్ తాలూకే కోలంక, వీరవరము, వగైరా గారు దీని ముద్రింపనాజ్ఞనొసంగిరి. నేనును వారియాజ్ఞమేరకు దీని ముద్రింపించితి.

ఏతద్గ్రంథకర్తగారినిఁగూర్చి పై నుదాహరించిన విషయములను దయాపూర్వకముగ నాకు వ్రాసిపంపిన బ్రహ్మశ్రీ దేవులపల్లి సుబ్బరాయశాస్త్రిగారికిని, నిది ముద్రితమగుచున్నకాలమున దీనిని నిర్దుష్టముగ సవరించి పరమోపకారంబొనర్చిన శ్రీమదాత్మకూరు సంస్థాన పండితులును, బాలసరస్వతీ తర్కతీర్థాది బిరుదాంకితులును ఘంటాశతాధిక గ్రంథకరణధురీణులు నగు శ్రీమాన్ శ్రీమత్తిరుమలబుక్కపత్తన శ్రీనివాసాచార్యులవారికిని శ్రీమత్కుమారాభ్యుదయ, కౌసల్యాపరిణయాది గ్రంథకర్తలు నగు బ్రహ్మశ్రీ, మహారాజశ్రీ, వావిలికొలను సుబ్బరావు పంతులు గారికిని, నేనెంతయుఁ గృతజ్ఞుఁడనై నమస్కరించుచున్నాఁడు.

ఇట్లు :
సుజన విధేయుఁడు,
☞ కొత్తపల్లి-వేంకటపద్మనాభ శాస్త్రి.

తిరువల్లిక్కేణి,
చెన్నపట్టనము,
1-8-1903.



శ్రీరస్తు.

శుభమస్తు.

అవిఘ్నమస్తు.

# రామధాటీ శ్లోకాః.

శ్లో. కల్యాణదం భవతు వస్తు కిమప్యజస్రం
స్త్రీపుంసరూప మతిలోక మచిన్త్య మాద్యమ్
రాజ్యశ్రియః కృతిపతే స్స్వసరూప మేవం
సంబోధయ న్నవనవాభ్యుదయాయ రాజ్ఞః. ౧.

శా. శ్రీకల్యాణఫలప్రదానచణమున్ స్త్రీపూరుషాకారము
న్లోకాతీత మచింత్య మాద్య మగుచు న్నొప్పిల్లు సద్వస్తు వ
స్తోకాత్మోపమరాజ్యలక్ష్మిం గృతినాథుం బ్రోచు నాచంద్రతా
రాకంబా ప్తము గ్రొత్తక్రొ త్తయగుచుం బ్రాణించు పెంపొందగన్.

వ్యా. శ్లో॥ వందే వందారుమందారం, తేజః కిమపి సుందరం। అధునా మిథునాకార, మవినాభావభాసురమ్. శ్లో॥ శ్రీరావువంశముక్తావళిరచనారుచిరవాక్యనిచయోయః, । దేవుః పల్లికులీనః కేవలరఘురామచరణశరణాత్మా, శ్లో॥ వేంకటకుమార మహీపతిసూర్యవిభోర్మఖ్యసంశ్రిత స్స్నేహం। సర్వజ్ఞకులమణే శ్శ్రీరావుకులేంద్రస్య సుబ్బరాయసుధీః శ్లో॥ రామధాటీసమాఖ్యాకశ్లోకానా మేకవింశతేః, కుర్వే జయపతాకాఖ్యాం, వ్యాఖ్యాం విఖ్యాతలక్షణామ్। అథశ్రీమాన్ పద్మనాయకకుల తిలకాయమాన రేచర్లగోత్రపవిత్ర రావువంశశిరోమణి ర్భాస్కరశాయనామా కవిః శ్లో॥ కావ్యం యశసేర్థకృతే వ్యవహారవిదే శివేతరక్షతయే, సద్యః పరనిర్వృతయే కాంతాసమ్మితతయోపదేశయుజే. ఇత్యాద్యాలంకారికవచనప్రామాణ్యా

త్కావ్యస్య సర్వేష్టశ్రేయస్సాధనతాం "కావ్యాలాపాంశ్చ వర్జయే" దిత్యస్యాసత్కా-
వ్యవిషయతాంచ, పశ్యన్ కృతినాయకస్య శ్రీరావు వేంకటకుమారమహీపతి
సూర్యరాయ మహారాజస్య రాజ్యలక్ష్మీప్రాప్త్యనంతరం, శ్లో. "లబ్ధప్రశమన
స్వస్థ" మిత్యుక్తత్వాత్, తద్రాజ్యలక్ష్మ్యాః నిత్యానపాయినీత్వసిద్ధ్యర్థం, రామ
ధాట్యాఖ్యైకవింశతిశ్లోకరూపం కావ్యం రచయితుకామః శ్లో॥ "ఆశీర్నమస్క్రి
యా వస్తునిర్దేశో వాపి తన్ముఖ" మితిన్యాయేన నాటకాద్యన్యతమసాహిత్యకత్వా దాదా
నవనవాభ్యుదయప్రాప్త్యాశంసారూపత్వేన ఆశీర్వచనరూపం మఙ్గళం నిర్దిశతి. "మ
ఙ్గళాదీని, మఙ్గళమధ్యాని, మఙ్గళాంతాని, తాని ప్రథంతే" ఇత్యుక్తత్వాత్.

కల్యాణదమితి, అద్యం=ప్రాథమికం, అతిలోకం=లోకాతీతం, అతఏవాచిం
త్యం = ధ్యాతుమశక్యమ్, స్త్రీపుంసరూపం=అర్ధనారీశ్వరస్వరూపం, లక్ష్మీనారాయ
ణాత్మకంవా, మాయేశ్వరాకృతివా, కల్యాణదం=సకలసంపత్ప్రదాయకం, కిమప్య
నిర్వాచ్యం, వస్తు=పూర్వోక్తదంపతిరూపం, నను. ఏకరూపస్య వస్తునో రూపద్వయ
సమ్మిశ్రితస్య దాంపత్య నిర్దేశః కథమితిచేత్, దంపత్యో రేకశరీరారంభకత్వం శ్రుతి
స్మృతి పురాణ ప్రతీత మేవేతి గ్రహా, కృతిపతేః-కృతీ=కుశలః - సమర్థ ఇతియావత్,
పతిః=భర్తాయస్యాః సా తథోక్తా, కుశలవల్లభేత్యర్థః, తస్యాః రాజ్యశ్రియః=రాజ్య
లక్ష్మ్యాః, కృతిపతేః=కృతినాం, కుశలానాం=సమర్థానాం పతి శ్శ్రేష్ఠః. ని. "కృతీ
కుశల" ఇ త్యపి త్యమరః. కృతేః=వక్ష్యమాణకావ్యస్య, పతిః=నాయకో వా.
ఏతద్విశేషణ ముభయత్రాపి తస్యరాజ్ఞః=రాజకుమారస్యచ, స్వసరూప మేవం, స్వసా
మ్యమేవేత్యవ్యయ స్యావధారణార్థః. ని. "స్యురేవంతు పునర్వై వేత్యవధారణవా
చకా". ఇత్యమరః. ఆత్మపదవినాభావ సంబంధమైకమత్యంచేత్యర్థః, సంబోధయత్=
పశ్యన్నుపదేశంకుర్వత్, నవనవాభ్యుదయాయ=వివాహపట్టాభిషేక పుత్రలాభాద్యనే
కాభ్యుదయపరంపరావాప్తయే, అజస్రం=సర్వదా, భవతు=అస్తు. యథాలోకే తావ
న్నిపుణదంపతీస్వస్నుషాం స్వపుత్రం చావామివ కుటుంబనిర్వహణే యువామపి
జాగరూకతయా వర్తేథా మి త్యుపదిశతః. తద్వదేవేతి ధ్వనిః. కల్యాణదమిత్యనేన
"దేవతావాచకాశ్శబ్దాయేచభద్రాదివాచకాః, తేసర్వేనైవనింద్యా స్స్యుర్లిపితో
గణతోపి", ఇత్యుక్తత్వాద్భద్రవాచక ప్రయోగః కృతః. ఆదావ్యదేవతాక తగణ
ప్రయోగ శ్శుభదః, "తో ద్వ్యంతో ల్యలఘు శ్శుభదో" ఇత్యుక్తత్వాత్. వసంతతిలకా
వృత్తమేతత్. "ఉక్తావసంతతిలకాతభజాజగౌగ" ఇతి.

టీ. ఆద్యం=సకలప్రపంచమునకు మొదటిదియు, అతిలోక=లోకాతీతమైనట్టిది యగుటగాన, అచింత్యం=ఇట్టిదని యూహింపశక్యముగానట్టిదియు, స్త్రీపుంసరూపం=అర్ధనారీశ్వరాకారముగాని, లక్ష్మీనారాయణాకృతిగాని, మాయేశ్వరస్వరూపముగాని యయినట్టియు, కల్యాణదః=ఐహికాముష్మికసకలశ్రేయస్సాధకంబగు, కిమపి = ఒకానొకయనిర్వాచ్యమైన, వస్తు=వస్తువు, కృతిపతేః=సర్వారియగుభర్తగల, రాజ్యశ్రియః=రాజ్యలక్ష్మికిని, కృతిపతేః=సర్వరులకు నాయకుడగు, లేక, కావ్యనాయకుడగు, రాజ్ఞః=రాజకుమారునికి, స్వసామ్యమేవం=ఆత్మోపమానముచే, సంబోధయత్=బోధించుచు, నవనవాభ్యుదయాయ=దినదినాభివృద్ధికొఱకు, అనఁగా వివాహ, పట్టాభిషేక, పుత్రలాభాది సకల సంపత్ప్రాప్తికొఱకు, భవతు=అవుఁగాక. ఇట్లు చెప్పుటచే లోకమున గృహయజమాను లగువృద్ధదంపతులు. తమకొడలికిని కుమారునకును, మావలె నేర్పునఁ గుటుంబ సంరక్షణముచేసికొనవలయునని యుపదేశించునట్లు లాశ్రితరక్షణ బంధుసన్మాన గురుపూజన ప్రజారంజన దుర్జన భంజ నాది కృత్యంబుల నేమఱక రాజ్యపాలనంబు సేయుండని యుపదేశించుట దోఁచుచుండు.

శ్లో. యే త్రయ్యుదీరితవిధానవిధావిసృష్టై
రంశైః స్వరా న్విదధతే సతతం సుపుష్టాన్
సాష్టాఙ్గికా మమ నతిః కథ మన్యథా స్యా
ద్గోబ్రాహ్మణేషు విజయిష్వవనౌకసేషు.

శా. సగోబ్రాహ్మణు లాగమోక్తవిధి హోమింప గూర్చుహవ్యాదులా
భాగంబు ల్గొని సంతతంబు క్రతుభుఙ్గ్వ్రాతంబు సంపుష్టమౌ
నాగోబ్రాహ్మణులందుఁ బూర్ణజయులందుఁ దశ్రాంతము న్ధాత్రిపై
నౌఁగా కొండెడ మామకంబు లగుసాష్టాంగానతు ల్సెల్లునే. ౨.

వ్యా. ఆదౌజగత్కారణభూత మర్ధనారీశ్వరస్వరూపం వస్తుప్రస్తుత్య తత స్సకలవాంఛితార్థప్రదత త్తద్దేవతా ప్రణామః కర్తవ్యేతి-త దసంఖ్యాకతయా దుర్ఘటత్వా త్తదభివృద్ధిమూలక గోబ్రాహ్మణేభ్యః ప్రణమతి, య ఇతి, యే=గోబ్రాహ్మణాః గావశ్చ-బ్రాహ్మణాశ్చ = గోబ్రాహ్మణాః ; తే. త్రయ్యుదీరితవిధానవిధావిసృష్టైః

త్రయీ=ఋక్సామయజూంషి, ని. ఇతి వేదాస్త్రయస్త్రయీత్యమరః. తయా=త్రయ్యా, ఉదీరితస్య=ప్రోక్తస్య, విధానస్య=విధేః, విధయా=క్రమేణ, విసృష్టైః=దత్తైః అంశైః= భాగైః, సురాణాం=దేవానాన్దే, పితృదేవతా ఇత్యర్థః, సతతం=నిత్యం, ని. "నిత్యానవరతాజస్ర సంతతావిరతానిశ" మిత్యమరః, సుపుష్టిం=సుతరాంపోషితాం విదధతే= కుర్వాతే, హవ్యకవ్యవిధిషు సకలదేవతాప్రీతి హవిర్భాగదానోచితస్య గవ్యస్యదానేన గావః తత్ప్రతిపాదనేన బ్రాహ్మణాశ్చ పుష్టిహేతుకా అభూవన్నిత్యభిప్రాయః. నను హవ్యకవ్య దానస్య క్షత్రియాదీనామ ప్యధికారో వర్తతే హి. కథం బ్రాహ్మణా ఏవదేవతాపుష్టిహేతవ ఇతిచే ద్బ్రాహ్మణేతరజాతీనాం కేషాంచి ద్వేదాధికారో యద్యప్యస్తి - తేషాం యాజనాధికారాభావేన చ. మంత్రస్య బ్రాహ్మణాధీనత్వ ప్రాధాన్యేనచ యథా, దధిఘృతాదేర్హవిష్ట్వ ప్రసిద్ధావత్త్వమపి గవ్యస్యైవముఖ్యత్వం - తథా బ్రాహ్మణానామేవ ముఖ్యత్వ ముక్తముక్తంచ భగవతా. "దైవాధీనం జగత్సర్వం, మంత్రాధీనంతు దైవతం, తన్మంత్రం బ్రాహ్మణాధీనం, బ్రాహ్మణోమమ దేవత" తేతి. తేషు = గోబ్రాహ్మణేషు అవనౌ తు. జగత్యాం తు, విజయిషు-సర్వోత్కర్షేణ - వర్తమానేషు సత్సు, మమ=మత్సంబంధినీత్యర్థః, సాష్టాంగికా=సాష్టాంగ రూపిణీ, నతిః = ప్రణామః, శ్లో. "ఉరసా శిరసా దృష్ట్యా మనసా వచసా తథా, పద్భ్యాం కరాభ్యాం కర్ణాభ్యాం ప్రణామోష్టాంగ ఉచ్యతే" తేతి. అన్యథా=అన్యత్రే త్యర్థః, కథంస్యాత్=కుతోభవేదిత్యర్థః, నభవేదేవేతిభావః. అనేన సకలదేవతాహ్లాద కరగోబ్రాహ్మణసాష్టాంగనమనేన తేషా మేవ ప్రీతిరిత్యభిప్రాయః, ఏవమేవోక్తం. భోజరాజేనాపి. "ఉచ్చైర్గతి ర్జగతి సిధ్యతి ధర్మతశ్చే, త్తస్యప్రమాణవచనైః కృత కేతరైశ్చేత్, తేషాంప్రకాశనదశా చ మహీసురైశ్చే, త్తానంతరేణ నిపతే త్క్వను మత్ప్రణామః" ఇతి. అనేన గోబ్రాహ్మణోపకర్తా భవేతి కృతిపతిం ప్రత్యుపదేశ స్సూచ్యతే. వసంతతిలకావృత్తమ్. లక్షణం తూక్తమేవ.

టీ. ముందు సకలజగత్కారణభూతమగు నర్ధనారీశ్వరస్వరూపవస్తువును బ్రస్తుతించి తరువాతఁ దత్తద్వాంఛితార్థప్రదతత్తద్దేవతాప్రణామముఁ జేయుటకు వారలసంఖ్యలగుటచే నదిదుర్ఘటంబగుఁగావునఁ దత్పుష్టిహేతుకులగు గోబ్రాహ్మణులకునమస్కరించుచున్నాఁడు. ఏ-యనుశ్లోకమందు. ఏ=ఏగోబ్రాహ్మణులు-త్రయ్యుదీరితవిధాన్వ విధావిసృష్టైః త్రయీ=ఋక్సామయజుర్వేదములచేత, ఉదీరిత=చెప్పఁబడిన, విధా

న=విధియొక్క, విధా=క్రమముచేత, విసృష్టైః=విడువఁబడిన-అనఁగా నియ్యఁబడిన, అంశైః=భాగములచేత, సురాణ్ = దేవతలననఁగా దేవపితృదేవతలననుట, సతతం= ఎల్లప్పుడును, సుతృప్తాన్=మిక్కిలిబలిసినవారిఁగా, విదధతే=చేయుచున్నారో-అనఁగాదేవపితృదేవతలకు సమర్పింపఁబడుహవ్యకవ్యములకు ముఖ్యోపయోగముగుగవ్యము నకుఁ గారణములగుగోవులును వానినిమంత్రయుక్తముగా వేల్చుటచే బ్రాహ్మణులును దేవాదితృప్తికారకులనియభిప్రాయము. అయినను వేదాధికారయుక్తులగుక్షత్రియాదిద్విజు లితరు లుండఁగా బ్రాహ్మణులుమాత్రము తత్తృప్తికారకులనుట యేల యనిన'- దధిక్షీరఘృతాదులు మాహిషాదులితరములున్నను గవ్యమునకే ముఖ్యత్వ మెట్టులో ద్విజులితరులున్నను వారికి ననఁగా క్షత్రియాదులకు యాజనాధికారము లేమింజేసి బ్రాహ్మణులకే ప్రాధాన్యము చెప్పఁబడెను. జగంబు దైవాధీనమనియు - మంత్రము బ్రాహ్మణాధీనమనియును-దైవము మంత్రాధీనమనియు - దానివలన బ్రాహ్మణులు తనకు దైవములని భగవద్వాక్యమును గలదు ; తేషు=అగోబ్రాహ్మణేషు - గోబ్రాహ్మణులు-అవనౌ=భూమియందు-విజయిషు = జయశాలులై యుండఁగా, మమ=నా సంబంధమును, సాష్టాంగికా=సాష్టాంగరూపమైన, నతిః=నమస్కారము, అన్యథా=మఱియొకలాగున, అనఁగానితరవిషయమున, కథం=ఎట్లు, స్యాత్ = అగును. అనఁగా మఱియొకలాగునఁ గానేరదనుట. ఇట్లు చెప్పుటచే సకలదేవతాప్రీతియే సూచింపఁబడియె. మఱియు గోబ్రాహ్మణోపకర్తవగుమని కృతిపతి కుపదేశము సూచింపఁబడియె. వృత్తము పూర్వోక్తము.

శ్లో. త్రస్తాయే రామధాటీషు, పద్మనాయకవంశజాః
త్యజతాం ద్విజతాం తేషాం, నజహాత్యన్వయాచితీ. 3.

తే. రామజయధాటికాపరిత్రస్తులైరి
పద్మనాయకకులజు లెవ్వారువారు
త్యక్తనైజకులాచారులైనఁ గాని
వారినిజవంశధర్మంబు వదల దయ్యె.

వ్యా. అథకృతిపతేరాభిజాత్యనిర్ణయం కరోతి. త్రస్తాఇతి. పద్మనాయకవంశజాః=పద్మానాం=కమలానాం,నాయకః=సూర్యః=పద్మనాయకః=తస్యవంశః=పద్మనా

యకవంశః, సూర్యవంశ ఇతియావత్ - అస్మిన్ జాతా ఇతి - పద్మనాయకవంశజాః, యే-పురుషాః - రామధాత్రీషు - రామస్య=పరశురామస్య, ధాత్రీషు=క్షైత్రయాత్రాసు, త్రస్తాః=భీతాః, తే = పద్మనాయకవంశజాః=పద్మనాయకసంజ్ఞకవంశోత్పన్నా ఇతి - ద్విజతాం=ద్విజత్వం. ని. "దంతవిప్రాండజా ద్విజా" ఇతి. క్షత్రియవైశ్యోపలక్షణం, ద్వాభ్యాం జాయత ఇతి-ద్విజః. "జన్మనా జాయతే శూద్రః, కర్మణా జాయతే ద్విజ", ఇత్యుక్త్వా చ్చూద్రాగ్ర వర్ణత్ర యస్యాపి ద్విజత్వముక్తం. తాం ద్విజతాం త్యజతాం, తేషాం=పద్మనాయకవంశజానాం, అన్వయౌచితీ, అన్వయస్య=వంశస్య, ఔచితీ-ఉచితస్యభావః ఔచితీ, అన్వయస్యౌచితీ - అన్వయౌచితీ=వంశసహజధర్మ ఇతి భావః, నజహాతి = నత్యజతి, తానితి శేషః. పురా కిల పరశురామ జయ ధాటికాసు, భీతాః పలాయితాః కేచన క్షత్రియాః సౌదాసా హైహయా ఆస్యే చ బహవో వేషాంతరాణి స్వీకృత్య కర్షకాగ్రేసరో భూత్వా శూద్రభావేన స్థిత్వా ఆత్మవంశాంకురాయస్వదేహ రక్షాం చక్రురితి తత్ర నారికవచాదయస్సూర్యవంశజా అపి సంతీతి చ పురాణ ప్రతీతిః, తస్మాత్సూర్యవంశజా ఏవ పద్మనాయక సంజ్ఞకవర్ణా బభూవురిత్యాఖ్యాయతే. త ఏవానుపనీతక్షత్రియాః తేషు శాస్త్రప్రసిద్ధాః, క్షిప్తరూపకాలంకారః, వృత్తమనుష్టుప్. "పంచమం లఘు సర్వత్ర, షష్ఠం గురు ద్విచతుష్పదయోః, గురు షట్కంచ సర్వేషాం, శ్లోకస్య లక్షణ" మితి.

టీ. ఇంకఁగవి కృతినాయకుని వర్ణనిర్ణయమును జెప్పుచున్నాఁడు. పద్మ=పద్మనులను. నాయకః = నాయకుఁడగు సూర్యుని యొక్క, వంశజాః = వంశమునఁబుట్టినవారు, యే=ఎవరు, రామధాత్రీషు, రామ=పరశురాములవారియొక్క, ధాత్రీషు=క్షైత్రయాత్రలయందు, త్రస్తాః=భయపడినవారు, అభూవన్నితి శేషః, బరనియధ్యాహార్యము, తేక - యే=ఎవరు, రామధాత్రీషు-పరశురాముని క్షైత్రయాత్రలందు, త్రస్తాః=భీతులైరో, తే=వారు, పద్మనాయకవంశజాః=పద్మనాయకసంజ్ఞకవంశోత్పన్నులని కాని యన్వయము. ద్విజతాం, ద్విజ=జన్మము చేశూద్రులుగాజనించి కర్మముచే రెండవ జన్మముగలవారు ద్విజులనియు నట్లగా వారిధర్మము ద్విజతయనియు, దానిని త్యజతాం=విడిచిన, తేషాం=ఆరాజులయొక్క, అన్వయౌచితీ, అన్వయ=వంశముయొక్క, ఔచితీ=ఉచితత్వము అనఁగాఁ గులధర్మము, తాం=దానిని, అనియధ్యాహార్యము, నజహాతి=విడువదు. వీరు కర్షకులనువిడిచినను-వీరిని క్షాత్రగుణములు విడువలేదని భావము. పూర్వముపరశురామునిధాటియందు భీతులై వేషాంతరులైనవారు కాకులు, హైహయులు, మొదలగువారు

రాజులవేషములను దాల్చియు, వైదిక కర్మములనువిడిచి శూద్రత్వము నంగీకరించి వంశాం కురముగాఁబడు స్వదేహసంరక్షణముఁ జేసికొనిరనియుఁబురాణప్రసిద్ధము. అందునూర్య వంశము రాజులుం గూడ శారీకవచాదులు గలరు. కర్మత్యాగులై శూద్రత్వమునంగీ కరించినయా రాజులే కలియుగంబున నుపనీతక్షత్రియులైపద్మనాయకులన నొప్పు చుండురని యూహింపఁ బడుచున్నది - ఇందుశ్లిష్టరూపకాలంకారము. అనుష్టుబ్వృ త్తము.

శ్లో॥ ప్రతాపరుద్ర రాజన్య, మూర్ధన్యభటనాయకాః,
ద్విషన్నీహారసంహార, రుచికాః పద్మనాయకాః. ౪.

కం. వీరప్రతాపరుద్రమ
హారాజభటాగ్రగణ్యులరిభూవరనీ
హారపరిహారలీలా
నారతరుచికు లిలఁ బద్మనాయకు లనఁగాన్. ౪.

వ్యా. అథ తేషా ముత్తమక్షత్రియానుబంధిత్వం వర్ణయతి. ప్రతాపఇతి. ద్విష న్నీహార సంహారరుచికాః ద్విషంత ఏవ నీహారో-హిమం, తస్య-సంహారే-హరణే, రుచి రభిలాషో యేషాంతే తథోక్తాః, స్వార్థేక ప్రత్యయః. అన్యత్ర, ద్విషంశ్చాసౌ నీహారశ్చ తం సమ్యగ్ఘరంతీతి సంహారా - రుచయోయస్య సతథోక్తః తాకి-స్వార్థేక ప్రత్యయః, పద్మనాయకాః=పద్మనాయకవంశజా సూర్యాఇతిచ. ప్రతాపరుద్ర రాజన్యమూర్ధన్య భటనాయకాః, రాజన్యానాం క్షత్రియాణాం మూర్ధన్యశ్శిరోభూషణం రాజన్య మూర్ధ న్యః, ప్రతాపరుద్ర ఇతి రాజన్యమూర్ధన్యస్తస్య భటా యోధాస్తేషాం నాయకాః=పత య:, బభూవురితి శేషః. ప్రతాపరుద్రమహారాజ భటనాయకత్వోక్త్యా మహాగౌరవ శీలికానూచ్యతే. అత్రరూపకానుప్రాణితశ్లేషాలఙ్కారః. వృత్తం పూర్వోక్తం.

టీ. తరువాత నీపద్మనాయకుల నుత్తమ క్షత్రియానుబంధమును జెప్పుచున్నాఁ డు. ద్విషన్నీహారసంహార రుచికాః-ద్విషత్=శత్రువులనెడు, నీహార=మంచుయొక్క, సంహార=హరించుటయందు, రుచికాః=అభిలాషగల, పద్మనాయకాః-పద్మనాయకకుల జాలగువారు, ద్విషత్=అవరోధకరూపమైన వైరముగల, నీహార = మంచుయొక్క, సంహార=లెస్సగా హరించుటగల, రుచికాః=తేజస్సుగల, పద్మనాయకాః=సూర్యు

బిరుదులు శ్లేషము. వీరు-ప్రతాపరుద్ర రాజన్యమూర్ధన్య భటనాయకాః, ప్రతాపరుద్ర రాజన్యమూర్ధన్య=ప్రతాపరుద్రమహారాజశిరోభూషణునికి, భటనాయకాః=సేనానాయకులు, బభూవుః=అయిరని యీమూలపదము ధ్యాహార్యము. దీనివలన క్షాత్రముగలవారై యుత్తమజాతిగలవారని భావము. ఇందు రూపకాను ప్రాణితమగు శ్లేషాలంకారము. వృత్తము పూర్వోక్తము.

శ్లో. సప్తైకాదశగోత్రాణాం, గణాలక్ష్మాణి యత్ర్యభూత్

నాగతాళవృషంపక్ష్వ, వర్ణం భేరుణ్డ కిట్యసి. ౫.

ఉ. గోత్రముగోత్రసంఖ్యగలగోత్రము లొక్కగణంబుగాఁగ భూ

మ్యత్రిజసంఖ్యచే గణములయ్యెను వానికి నొక్క టొక్కటై

చిత్రము నీలముం బసపు శ్వేతము రక్తము సాళువంబునుం

బోత్రియుఁ గత్తిఁ దాళమును భోగి వృషంబు ననంగఁ గేతువుల్

వ్యా. జాతినిర్ణయానంతరం గోత్రగణసంఖ్యాదీన్ వివృణోతి. సప్తేతి. గోత్రాణాంసప్త, ఏకో గణః, సప్తసంఖ్యాకాని గోత్రాణ్యేకోగణఇత్యర్థః. లక్ష్మాణి=చిహ్నాని, ఏకాదశసంఖ్యాకాని, యత్=యస్మాత్కారణాత్, అభూవన్నితి శేషః. అనేనసప్తసప్తతిసంఖ్యాకానిగోత్రాణిసంతీతిభావః. సప్తగోత్రాణ్యేకోగణః, తాదృశగణా, ఏకాదశబభూవుః, ఏకాదశసప్తకం-సప్తసప్తతిరభూత్. తథా, మదీయే రావువంశము కావర్ణ్యం, సప్తసప్తతిసంఖ్యాకగోత్రజాః పద్మనాయకాః, తత్ర రేచర్లగోత్రేస్మిన్ బే తాళః కులదీపకఇతితన్నిశ్చినోతి. నాగేతి, నాగతాళవృషం=నాగశ్చ తాళశ్చ వృషశ్చ నాగతాళవృషం. ప్రాణితూర్యసేనాంగానామేకవద్భావః, నాగః=సర్పః, తాళః=తాళద్రుమః, వృషః = వృషభః-పంచానాంసితాసితరక్తపీతచిత్రరూపాణాం వర్ణానాం సమాహారః పంచవర్ణం, భేరుండకిట్యసి. భేరుండః=పక్షివిశేషః కిటిః=వరాహః, అసిః=ఖడ్గశ్చ,వి. "కోలఃపోత్రీకిరిఃకిటిః" ఇత్యమరః. సర్పధ్వజ తాళధ్వజ వృషభధ్వజ శ్వేతధ్వజ నీలధ్వజ రక్తధ్వజ పీతధ్వజ చిత్రధ్వజ భేరుండధ్వజ వరాహధ్వజ ఖడ్గధ్వజా ఇత్యేకాదశలక్ష్మాణ్యుక్తాని, వృత్తంతుపూర్వోక్తమేవ.

టీ. ఈశ్లోకమున గోత్రములసంఖ్యను గణములను చిహ్నములను దత్సంఖ్యను౦ జెప్పుచున్నాఁడు. గోత్రాణాం=గోత్రములయొక్క, గణాః=గణములు, సప్త=ఏడ్కు,

అనఁగా కేడేసిగోత్రము లాక్కొక్కగణము, అవి ఏకాదశ=పదునొకొండు, లక్ష్మాణి=చిహ్నములు, క్రమాత్=క్రమముగా, యత్=ఏకారణమువలన, ప్రోక్తానీతి శేషః=చెప్పఁబడినవో యని యధ్యాహార్యము. ఇట్లు చెప్పటచే వీరిగోత్రములు డెబ్బదియేడయ్యె నెట్లనిన.—ఏడేడుగోత్రము లొక్కొక్కగణము, గణమునకొక్కొక్క చిహ్నముచొప్పునఁ గ్రమముగాఁబదునొకొండు చిహ్నములైనవి. వానిని జెప్పుచున్నాఁడు. నాగతాళవృషం నాగ=సర్పము, తాళ=తాటిచెట్టు, వృషం=వృషభము, పంచవర్ణం=అయిదురంగులు, అనఁగాఁదెలుపు నలుపు యెఱుపు పసుపు చిత్రవర్ణమును, భేరుండకిట్యసి, భేరుండ=రెండుతలలపక్షి, సాళువమని కొందఱందురు, కిటి=వరాహము, అసి=కత్తియును గా పదునొకొండువిధములధ్వజము లేర్పడెను గాన డెబ్బదియేడుగోత్రములు, పదునొకండు గణంబులు నన్నియు చిహ్నములుం నేర్పడెనని తెలియవలయును. ఉ. "డెబ్బదియేడు గోత్రములఁ దీవివహించినవెల్మ వర్ణపుం" "సప్తసప్తతిగోత్రప్రశస్తిగాంచి" యనియు రంగారాయచరిత్రము. అనుష్టుప్పు.

శ్లో. రేత్వర్థకామా చరణం,చరో లా దాన ఉచ్యతే
తతో రేచరలాభిఖ్యం,గోత్రం శ్రీద మఖూ రిపూ. ౬.

కం. రా యర్థమగుసికామం
బీయగి రే యగును భోగ మొసఁగును జరయా
గాయీవియలాశ్రీదం
బై యల రేచెరలగోత్రంమలరుచునుండున్. ౭.

వ్యా. అథకృతినాయకగోత్రనిర్వచనంకరోతి. రేతి. రా=ధనం, ఇః=కామః-రాచేశ్చరే రాకారే కారా మిళిత్వా రే భూతాం తౌతు అర్థకామావితికవిరేవ నిర్వచన ముకరోత్, చరశ్చరణం,భోగ=అనుభూతిరితియావత్, అర్థకామానుభూతిరితిభావః. లదానేతిధాతోర్దానంఅర్థస్య-దానం, ధనదానం, కామస్యదానమభీష్టదానం-తతస్తస్మాద్రేచరలాభిఖ్యం; రేచరలసాంజ్ఞకం, శ్రీదం=సంపత్ప్రద మర్థకామప్రదంవా శ్రీశ్చశ్చశ్రీ తౌదదాతిశ్రీదం గోత్రమిహాస్మిఁలోకే భూద్భూతాం. వృత్తంపూర్వోక్తం.

టీ. గోత్రసంఖ్యాదులను. జెప్పి కవికృతినాయకునియొక్క గోత్రనిర్వచనమును జేయుచున్నాఁడు. రేయనఁగా, రా=ఇ, రెండునుం గలసి రే యయ్యెను గాన రాయ

నగా ధనము. ఇ యనఁగాఁ గామము; ఈరెంటుఁ గలిగి కే యర్యోగము, అర్థకా ముములనుట. కేతు=అర్థకాము అర్యోగము. చరః అనఁగా చర, అనుధాతువువలన అను భవించుట, లా దానేయనుధాతువువలన నిచ్చుటగాని, యనుభవించుటగాని, యగు ను. అనఁగా అర్థకాములయొక్క దానభోగములు గలది యనుట, తతః=దానివలన, కేచరలాభిఖ్యం=కేచరలయను పేరుగలిగినట్టియు, శ్రీదం=సంపత్ప్రదమైనట్టియు కేక యర్థకాముప్రదమైనట్టియగు గోత్రం=గోత్రము, ఇహ=ఈలోకమున, అభూత్=అయెను, వృత్తము పూర్వోక్తము.

శ్లో. అరావుశబ్దాద్యలోపే, భాషాయాం రావ్యితీరితమ్
అద్యన్తరావుపదభా, గ్విక్రమీ పురుషః కిల. ౭.

సీ. ధర నరిశబ్దస ప్తమ్యేకవచనం బ
రౌ యగు శత్రువ ర్యాయ మగుచు
నహితులవిషయమై యనునర్థమునుగూడి
యు యనఁగ రుద్రార్థ మొప్పవాని
సంధింపఁగ నరావు శబ్దమా నదియాంధ్ర
భాషవర్ణాగమ వర్ణలోప
ముఖనియమంబుల మొదటియకారంబు
లోపింప రావునాఁ రూపుఁగాంచె
నట్టిరావుపదద్వయం బాదిఁ దుదను
గలుగునామంబు చేమించు ఘనయశుండు
విక్రమి యనంగ నెల్లెడ విసుతిఁగాంచు
విక్రమంబన నతిశక్తి వెలయఁగాదె. ౭.

వ్యా. గోత్రనిర్వహసంస్కృతాంధ్రభాషాచారకీర్త్య గ్రామ పాయన్త యాది సంజ్ఞాపూర్వకగృహనామ వివరణాన్న త్స్యర్యాచనం కరోతి. అరావ్యితి. భాషా యాం మాంధ్రభాషాయాం అరావు శబ్దాద్యలోపే అరా-ఉః-అరావుః, అరా=శత్రౌ. విషయే, ఉః=రుద్రః అరావుః, రిపురౌద్ర ఇతిభావః. తస్య. అరావు శబ్దస్య అదాయః

అకారలోపవర్తతే తస్య లోపేసతి రావ్వితి తరితం=ఉక్తం, అరావుశబ్దాద్యభూతస్య అకారస్య లోపేసతి, రావుశబ్దోభవత్. ప్రకృతి శబ్దస్య భాషాంతరేషు వర్ణాగమ వర్ణలోప వర్ణవ్యత్యయేషు భవత్సురూప వికృతిర్భవతి. తస్మాదరావు శబ్ద ఏవ రావు శబ్దోభూదితిజ్ఞేయః, అరావుశబ్దోపిశత్రు రౌద్ర ఇతియాపదర్థో రావుశబ్దో ప్యాంధ్ర భాషామర్యాదా సంభూతవర్ణలోపరూపమేత్యేతావదర్థో భవతీతి నిశ్చితం. అథ గృహనామ నిర్వర్ణనానంతరం నామోపరిబిరుదాంకంవక్తి, ఆదీతి, ఆద్యంతరావుపద భాక్-ఆద్యంతయోః=నామపూర్వోత్తరస్థానయోః రావు పదంభజతీత్యాద్యంతరావు పద భాక్, ఏతాదృశ రావుపదద్వయ మధ్యగతనామేత్యర్థః, పురుషః=పుమాన్, విక్ర మీ=విక్రమాతిశక్తిః. విక్రమస్త్వతి శక్తిరిత్యుక్తత్వాత్ తద్వాన్ విక్రమిశిల. అ త్యంతసమర్థః ఖల్వితిభావః, కిలేతిప్రసిద్ధౌ. వృత్తంపూర్వోక్తమేవ.

టీ. కవి గోత్ర నిర్వచనముజేసి యాంధ్రదేశమర్యాదానుసారము గ్రామనామ పౌరుషేయనామ భేదసిద్ధగృహనామమును జెప్పుచున్నాఁడు. భాషాయాం=ఆంధ్రభాష యందు, అరావుశబ్దాద్యలోపే, అరావు=అనఁగా శత్రురౌద్రుఁడు, అరావు శబ్ద=అయి రావుశబ్దముయొక్క, ఆద్యలోపే, ఆది=మొదటఁగల, అ=అకారముయొక్క, లోపే= లోపము గలుగుచుండఁగా, రావ్వితీరితం, రావు - ఇతి=రావ్వితి. ఈరితం, రావ్వితీ రితం, అనఁగాఁ "రావు" అని చెప్పఁబడియె. ప్రకృతియగు సంస్కృత శబ్దములకంటె, వికృతులగు నితరభాషలయందు - వర్ణలోప వర్ణాగమ వర్ణవ్యత్యయములు వచ్చు సంప్ర దాయమునుబట్టి, అరావుశబ్దమున, అకారములోపింపఁగా, రావుశబ్దమయ్యెను, ఆద్యం తరావుపదభాక్. ఆది = మొదటను, అంత=చివరను, రావుపదభాక్, రావు=శత్రు రౌద్రుఁడనెడి, పద=చిహ్నమును, భాక్=పొందిన పేరుగల, పురుషః=పురుషుఁడు, విక్రమీశిల, విక్రమమనఁగా నతిశక్తి, అదిగలవాఁడు విక్రమియనంబడును-అతిశక్తిశాలి కదాయని యర్థము. వృత్తము పూర్వోక్తము.

శ్లో. అరావు సంతతీరావు, సంతతి స్తత్ర యేభవన్
రుద్రాదిత్యాదయస్తేషా, మతివీరోనపోత్తమః. ౫.

ఆ. రావుసంతతియె యరావు సంతతియునై
యధికవీర్యయుక్తి యశముగాంచె

నంచు నుదయ మొందిరి నట్టిరుద్రాదిత్య
ముఖులలోఁ దగు ననపోతవిభుఁడు. ౮.

వ్యా. అథకూటస్థ పురుషం, వంశప్రధాన పురుషంచ నిరూపయతి. అరావ్వితి, రావుసంతతిః = పూర్వోక్త రావూపపదసంతతిర్వంశః. ని. "సంతతిర్గోత్రజననకులా న్యభిజనాన్వయా" ఇత్యమరః. అరావుసంతతిః - అరావుః=శత్రురౌద్రిసంతతి=సంతానో యస్యాస్సా, అరావుసంతతిః. తత్ర, తస్యాం=సంతత్యాం, రుద్రాదిత్యాదయో-రుద్రాదిత్యనామకప్రముఖా యే రాజానోఽభవన్ = జాతాః. తేషాం=రాజ్ఞాంమధ్యే, అనపోత్తమః, అనపోతమనీడితి ప్రసిద్ధనామాపురుషః - అతివీరః= అతిశూరః ప్రాదుర్భవదిత్యర్థః. రావుసంతతిరరావు సంతతిరితి విరోధాభాసాలంకారః. అత్రరుద్రాదిత్యాదయోఽభవన్నిత్య నేనైకాదశరుద్రాణాం, ద్వాదశాదిత్యానాంచోత్పత్తి సూచనేనైతస్యాస్సంతత్యా అదితి సంతతిత్వం చ, తేనదేవాంశత్వంచధ్వన్యతే. విరోధాభాస శ్లేషాలఙ్కారా. వృత్తంపూర్వోక్తమ్.

టీ. ఇందుఁగూటస్థపురుషుని వంశముఖ్యపురుషుని నిరూపించుచున్నాఁడు. రావు సంతతి, పూర్వోక్తరావుపదోప పదవంశము, అరావుసంతతి, అరావు=శత్రురౌద్రమగు, సంతతిః=సంతానముగలది. తత్ర=అవంశమున, రుద్రాదిత్యాదయః=రుద్రాదిత్యుఁడు మొదలగు వారును, రుద్ర=ఏకాదశరుద్రులును, ఆదిత్య=ద్వాదశాదిత్యులును, ఆదయః=మొదలగుదేవతలని శ్లేషము, యే=ఏప్రభువులు, అభవన్=అయిరి, అనఁగా నుదయించిరో, తేషాం=వారిలో, అనపోత్తమః, అనపోత్తమనీడను ప్రభువు, అతివీరః=మిక్కిలి శూరుఁడు, ఉదయించెనని యథార్థ్యాహార్యము. ఈవంశమున రుద్రాదిత్య ప్రముఖు లుదయించుటచే నదితివంశమనియును, వీరు దేవాంశసంభూతులనియును, శ్లేషమూలమున సూచింపఁబడుచుండెడు. ఇందు విరోధాభాసశ్లేషాలంకారములు. ఇదియును బూర్వోక్త వృత్తమే.

శ్లో. సర్వజ్ఞమాధవౌయస్య, పుత్రౌద్వావభిసుశ్రుతౌ
తదన్వయాగమోఽభూమా, బహుశాఖాభిశోభితః. ౯.

గీ. ప్రథితు లిరువురుసుతులు సర్వజ్ఞమాధ
వులు జననమందె రలయనపోతధరణి

ధవునకుఁ దదన్వయాగమం బవనియందు
నమితశాఖాభిశోభితం బై తనర్చు. గీ.

వ్యా. మూలపురుషం వర్ణయిత్వా తత్సంతతిం నిరూపయతి. సర్వజ్ఞేతి, యస్య=పూర్వోక్తస్యాన్నపోతనృపస్య, ద్వౌపుత్రౌ, సర్వజ్ఞమాధవౌ = సర్వం జానాతీతి సర్వజ్ఞః, తథోక్తః, మాయాః=లక్ష్మ్యాః, ధవః, మాధవః, లక్ష్మీసంపన్న ఇతియావత్. ని. "ఇందిరా లోకమాతా మా" ఇత్యమరః. తౌ=సర్వజ్ఞమాధవౌ, తదాఖ్యౌ, యద్వా, సర్వజ్ఞః=శర్వః-మాధవః=శ్రీహరిశ్చ, అభివిశ్రుతౌ తయోరేకస్సర్వజ్ఞత్వప్రసిద్ధ్యా రసార్ణవసుధాకర చంద్రికాఖ్యాంతర సింగభూపాలీయ గ్రంథనేతా, రూపకపరిభాషాది గ్రంథకర్తా చ, అన్యస్తు - శైవవైష్ణవవివాదాస్పదదివ్యస్థలసీమా విభాగనిర్ణేతా, తౌ=పుత్రౌ, పున్నామనరకాత్త్రాయత ఇతి వ్యుత్పత్తేః, జాతావితిశేషః. తదన్వయాగమస్తస్యాన్నపోతనేతురన్వయో వంశస్స ఏవాగమస్సంతతి రూపక ప్రవృద్ధిర్యద్వా తదన్వయ ఏవ, అగమో వృక్షః, ని. "ద్రుద్రుమాగమా" ఇత్యమరః. ఉభయథాపి, భూమౌ=ధాత్ర్యాం, బహుశాఖాభిశ్శోభితః—బహ్వీభిః = అనేకాభిశ్శాఖాభిఃకుటుంబరూపాభిరిత్యన్వయపక్షే, బహ్వీభిః=అనేకాభిశ్శాఖాభిర్విటపైరితివృక్షపక్షే, అభిశోభితః=ప్రకాశమానస్సన్ వర్ధత ఇతిశేషః. అనేన వృక్షత్వారోపణేనాస్య వంశస్య, యథాలోకే, కిసలయదళ ముకుళ కుసుమశలాటు ఫలచ్ఛాయాదిభిస్సకలజంతు సంతోషకారిత్వం తరోరివ దాన సన్మానక్రీడాపహరణాది బహువిధోపకారైస్సకలజీవలోక పాలకత్వం సూచ్యతే. అనుష్టుప్. శ్లేషాలఙ్కారః.

టీ. యస్య=ఏయన్నపోతమనీనికి, ద్వౌ=ఇరువురై, సర్వజ్ఞమాధవౌ=సర్వజ్ఞమాధవులను పేరు గలవారు, అభివిశ్రుతౌ=సుప్రసిద్ధులగు సనఁగా సర్వజ్ఞసింగమనీడనియుఁ బిరుదుల మాధవరావనియుఁ బ్రసిద్ధులుకుట; ఈ సర్వజ్ఞసింగమనీని చరిత్రము వ్యాఖ్యాతచే చేయఁబడిన సంస్కృతరావువంశముక్తావళియందును, నతని తమ్మునిచేఁ జేయఁబడిన యాంధ్రరావువంశముక్తావళి ప్రబంధమునందును, రావు బహద్దరు కందుకూరి వీరేశలింగకవి, గురజాడ శ్రీరామమూర్తికవి, ద్వయవిరచిత కవిజీవితములయందును, శ్రీనాథకవి విరచితాంధ్ర భీమఖండగ్రంథపీఠికయందును విమర్శింపఁబడియును. తిరుమణి మాధవరావుల చరిత్రము పక్కలంక వీరభద్రకవి కృత పానపదత్త్రపరిణయప్రబంధముంగావళియందును, సన్మథునయకృతి రావువంశముక్తావళి గ్రంథ

ములయందును, బాదపలయందును. అట్టి పుత్రౌ=కొమరులు, జాతౌ=ఉదయించిరనియ ధ్యాహార్యము. లేక, సర్వజ్ఞమాధవౌ=శివకేశవులు, పుత్రౌ=సుతులై, జాతౌ=ఉదయించి రనికాని చెప్పవచ్చును; తదన్వయాగమః. తత్ = ఆయనపోతమనీనిరొక్క- అన్వయ=వంశమురొక్క, ఆగమః = రాకయనఁగాఁ దదారంభముగా నిప్పటివఱకు పరంపరారూపముగ నవిచ్ఛిన్నముగాఁ బెరుఁగుచుండుట; బహు శాఖాభిశోభితః, బహు=అనేకములగు, శాఖా = కుటుంబములచేత, అభిశోభితః = ప్రకాశించుచున్న దిరై, వృద్ధిపొందుచుండునని యధ్యాహార్యము; మఱియు, తదన్వయాగమః, తత్ = ఆయనపోతమనీనిరొక్క, అన్వయ=వంశమను. ఆగమః=వృక్షము, బహుశాఖాభిశోభితః, బహు= అనేకములగు, శాఖ = కొమ్మలచేత, అభిశోభితః = ప్రకాశించుచు, స్థితః=ఉండెననియు, నధ్యాహార్యము. ఇట్లు చెప్పుటచే లోకమున గొప్పవృక్షము ఫలదళచ్ఛాయాదులచే జీవకోటి కెంతసౌఖ్యకారియో, యీవంశంబును నట్టులే యనేక రూపోపకారములచే లోకసౌఖ్యప్రదమని తోఁచుచున్నది.

శ్లో. పురుషోత్తమస్సనామా సంభవతియుగేయుగేచ రక్షార్థై
భృగురఘుయదురావుకుల ప్రభవా రామాజగత్సువిఖ్యాతాః.

గీ. ఒకటి-నామంబుతోఁ బురుషోత్తముండు
యుగయుగంబున నవతారమొందుచుండు
రక్షకై భృగు రఘు యదు రావు కులము
లందు రాములనంగ విఖ్యాతిఁ గాంచి.

వ్యా. కూటస్థపురుషసంతతింవర్ణయిత్వాథకృతిపతే ర్వంశం రామరాయాభిధానం ప్రభుం ప్రస్తౌతి. పురుషోత్తమ ఇతి. పురుషోత్తమః=శ్రీహరిః 'శ్రీపతిః పురుషోత్తమః,' ఇత్యమరః. యుగేయుగేచ= ప్రతియుగే, వీప్సాయాంద్విరుక్తిః. రక్షార్థై=జగద్రక్షణార్థం, సనామా, సమానంనామ=అభిధానం, యస్యతథోక్తస్సన్, సంభవతి=అవతారమాప్నోతి. తమేవార్థంవివృణోతి. భృగ్వితి, భృగు రఘు యదు రావు కులప్రభవాః= భృగురఘుయదురావు సంజ్ఞానికులాని ప్రభవః కారణం యేషాంతే భృగురఘుయదురావు కులప్రభవాః, రామాః=రామశ్చరామశ్చ రామశ్చరామశ్చ-రామాః, రామః=పరశురాం, [illegible] రామశ్శ్రీరామః, రామోబలరామః, రామశ్శ్రీరామరాయాఖ్యః, తే, రామాః.

జగత్సు, బహువచనేన, త్రిభువనేషువా, చతుర్దశభువనేషువా, విఖ్యాతాః=ప్రసిద్ధాః అభూవన్నితిశేషః. "పరిత్రాణాయసాధూనాం, వినాశాయ చదుష్కృతాం, ధర్మ సంస్థాపనార్థాయ, సంభవామియుగేయుగే" ఇతిస్వవాక్య ప్రామాణ్యార్థం. భగవా న్నారాయణః కృతత్రేతాద్వాపరేషు పరశురామశ్రీరామ బలరామతయావతార మేత్య, కలౌ రావు రామరాయరూపేణ సనామావతారమూపేత్యర్థః. వసుయుగాంత రచర్యాప్రదానా మత్యద్భుతక్రియాధురీణానా మనేకలోక ప్రసిద్ధిర్యుజ్యతే, కథం, కలౌ ప్రాప్తోదయస్యతాదృశ ప్రతీతిర్ఘటతేతి. నాశంకనీయం, యదసౌ కురియోపి, రామస్స్వాశ్రితద్విజకారిత బహుక్రతుహవిర్భాగ భోగసంతర్పిత దివిజతయాస్వర్గేచ, మహౌదార్యశౌర్యధైర్యస్థైర్యప్రముఖ గుణగణగణనీయతయా మర్త్యేచ, స్వబాహు ధృతక్షితితలవిశ్రామిత శిరస్సహస్రేణ నిర్భరానందకందళితహృదయేన వాసుకినా స్తూయమానతయా రసాతలేపి, విఖ్యాతఇతిభావః. అత్ర రూపకాలఙ్కారభేదః. ఆర్యావృత్తమేతత్.

టీ. కవి మూలపురుషునివర్ణించి యిప్పుడు కృతిపతిజనకుండగు రామరాయ ప్రభువును బ్రస్తుతించుచున్నాఁడు. పురుషోత్తమః=శ్రీహరి, యుగేయుగేచ=ప్రతియుగ మునందును, రక్షార్థై = జగద్రక్షణార్థముగా, సనామా = ఏకనామముగలవాఁడై, సంభ వతి = అవతరించుచున్నాఁడు, కవియాయర్థము నుత్తరార్థమునఁ బ్రకటించుచు న్నాఁడు, భగవంతుడు. "పరిత్రాణాయసాధూనాం, వినాశాయచదుష్కృతాం, ధర్మసంస్థాపనార్థాయ, సంభవామియుగేయుగే." అని యానతిచ్చినందున, స్వవాక్య ప్రతిపాలనార్థము, శ్రీహరి, భృగు రఘు యదు రావు కులప్రభవాః=కృతయుగంబున భార్గవరామాఖ్యచేతను, త్రేతాయుగంబున రఘురామాఖ్యచేతను, ద్వాపరంబున యదు రామాఖ్యచేతను, అనఁగా బలరామాఖ్యచేతను, కలియుగంబున రావు రామాఖ్యచేతను, అవతరించిన, రామాః=నలువురురాములు, జగత్సు=లోకములయందు, విఖ్యాతాః= ప్రసిద్ధులైరనిభావము. అయినయుగాంతరమున నత్యద్భుతచర్యలుగల మొదటి మువ్వురురాములకును, జగత్సు = లోకములయందును - అను బహువచనస్వారస్యము సిద్ధించునుగాని - కలియుగంబున నాధునికుఁడగు చతుర్థరామున కెట్లు లోకాంతర ప్రసిద్ధిసంఘటించునని సందియముఁ బొందవలదు. ఏమన నీమనుజాధిపుఁడు నిజాశ్రిత బ్రాహ్మణులచేఁ జేయించుయజ్ఞంబులహవిర్భాగంబు ననుభవించి తృప్తిఁబొందినదివిజ

లచే స్వర్గలోకమందును, ననివార్యమహౌదార్యధైర్యస్థైర్య గుణగణగణనీయుం డగుటచే మర్త్యలోకంబునను, నిజభుజాదండంబున భూమండలంబు దాల్చి యనంతునికి విశ్రాంతి గలుగఁజేయుటచే నతనివలన స్తుతింపంబడుటం జేసి రసాతలంబునను, బ్రసిద్ధుండయ్యెనని భావము.

శ్లో. మఙ్గాంబయైవ మహితః ఖలు పుత్రవత్యా
శ్రీరామరా డ్బహుపరిగ్రహసంగ్రహోపి
శాఖాసహస్రభరితోపి రసాలభూజ
శ్చక్షుః ప్రియస్సఫలయా లతయా హి లోకే. ౧౦.

చం. ఘనుఁడ లరామరాణ్మణి దగం బహువల్లభుఁ డయ్యుఁ బుత్రునిం
గని భువనంబుల న్వినుతిఁ గన్న సతీమణి మంగయాంబచే
తనె కద మాన్యుఁడయ్యె ఫలితం బయి పొల్పగు కొమ్మచేఁ గదా
కనుఁగొనరమ్య మాను సహకారము శాఖలు చాలఁ గల్గియున్. ౧౦.

వ్యా. నను బహువల్లభో సౌ కస్యామముం కృతిపతిం జజ్ఞావా నిత్యాశంక్యాహ. మంగాంబయేతి. శ్రీరామరాట్, శ్రీరామ ఇతి రాట్ ప్రభుశ్శ్రీరామరాట్, బహుపరిగ్రహసంగ్రహోపి=బహూనా మమితానాం పరిగ్రహాణాం దారాణాం సంగ్రహోపి=స్వీకారయుక్తోపి. 'పత్నీ పరిజనాదాన మూలశాపాః పరిగ్రహా' ఇత్యమరః. పుత్రవత్యా=పుత్రసంతానశాలిన్యా మంగాంబయైవ పట్టమహిష్యా, మంగయాంబికయైవ మహితః ఖలు. యథా రసాలభూజః=చూతవృక్షః. వి. 'ఆమ్రశ్చూతో రసాల' శ్చేత్యమరః. శాఖాసహస్రభరితోపి, శాఖానాం=విటపానాం సహస్రేణ, భరితోపి=పూర్ణోపి, సఫలయా=ఫలేన సహితా సఫలా, తయా, సఫలయా లతయా, శాఖారూపయా, లోకే=జగతి, చక్షుః ప్రియో హి, చక్షుషో=లోచనయోః ప్రియః=ప్రీతికరో హి, అత్రదీపకాలఙ్కారః. "మణి శాణోల్లీఢః సమరవిజయీ హేతినిహతో మదక్షీణో నాగః శరది సరితః శ్యానపులినాః, కలాశేషశ్చన్ద్రః సురతమృదితా బాలవనితా తనిమ్నా శోభన్తే గలితవిభవాశ్చార్థిషు నృపాః" [illegible] వసంతతిలకా వృత్తము.

టీ. ఈ ప్రభువు బహువల్లభుఁడుగదా, ఏదేవియం దీకృతినాయకునిం గాం

[illegible]

హెూవి=అనేక కళత్రములు గలవాఁడైనను, పుత్రవత్యా= పుత్రసంతానము గాంచిన, మంగాంబయైవ=మంగయాంబచేతనే, మహితః ఖలు=మాన్యుఁడయ్యెనుగదా. లోకే = ప్రపంచమందు, శాఖాసహస్ర భరితోపి, శాఖాసహస్ర=పెక్కువేల కొమ్మలతో, భరితోపి = నిండియున్నను, రసాలభూజః=మామిడిచెట్టు, సఫలయా=ఫలములతోఁ గూడియున్న, లతయా = కొమ్మచేత, చక్షుః ప్రియోహి, చక్షుః=నేత్రములకు, ప్రియోహి = ఆనందకరమైనది గదా. అనఁగా పలేక కాంతలు గలిగియున్నను బుత్రవంతురాలగు మంగయాంబచేతనే రామరాయ ప్రభువు మాన్యత నొందెను; ఎట్లనినఁ బెక్కువేల కొమ్మలు గలిగియున్నను మామిడిచెట్టు ఫలవంతమైన కొమ్మచేతనకదా నేత్రమనోహరమైనదగును. ఈశ్లోకమున దీపకాలంకారము. వసంతతిలకా వృత్తము.

శ్లో. పుత్ర స్తయోరయ మపారకృపారసోద్య
ద్దృక్పూరసార చరితార్థ వరార్థి సార్థః
శ్రీసూర్యరాట్సురతరు స్సుమన స్సుగన్ధః
పృథ్వీతలే విజయతే జనభాగ్యహేతోః. ౧౧.

ఉ. వారల నందనుండయి యశఃపారకృపాసముదారచారుదృ
క్పూరరసప్రసారపరిపూరితభూరితరేప్సితార్థి యీ
సౌ రగుసూర్యరాయసురసాల మిల న్సుమనస్సుగంధవి
స్ఫారతచేఁ దలిర్చు జనభాగ్యగతిం బరమోన్నతస్థితిగా. ౧౧.

వ్యా. తస్య పుత్రస్య తియదవాఖాదీ న్వివక్షు రాదౌ ముఖ్యనామ నిర్దిశతి. పుత్రఇతి. శోభనశ్చాసౌగంధస్సంబంధశ్చ స్సుగంధః. వి. 'గంధోగంధక ఆమోదేలేశే సంబంధ గర్వయో' రితి శబ్దార్ణవే. సుమనసాం=పండితానాం సంబంధోయస్య తథోక్తః, అన్యత్ర-సుమనసాం=పుష్పాణాం సుగంధః=సు వాసనా యస్య స ఇతివా. సుమనసాం=దేవానాం సుగంధః సుసంబంధో యస్య స ఇతి వా తథోక్తః. నవిద్యతే పారో యస్య స అపారః; కృపైవరసః-కృపారసః, అపారశ్చాసౌ కృపారస, శ్చాపారకృపారసః, తే నోద్యంత్యౌదృశౌ, తయోః పూరః సమూహ స్తస్య సార స్తేన చరితార్థాః, అత ఏవ వరాః= శ్రేష్ఠా అర్థినః= యాచకా స్తేషాంసార్థస్సంఘో యస్యసః, శ్రీసూర్య

రా ట్సురతరు స్సురాణాం తరు స్సురతరుః=కల్పవృక్షః, శ్రీసూర్యరాయ ఏవ సుర
తరు రయం పరిదృశ్యమాన స్తయో ర్దంపత్యో స్తుంగయాంబా రామరాయయోః,
పుత్ర్నామనరకా త్త్రాయత ఇతి పుత్రః కుమారస్సన్, పృథ్వీతలే-జనభాగ్యహేతో
ర్మానవ భాగధేయ వశా ద్విజయతే=సర్వోత్కర్షేణ వర్తతే. అయం కుమార స్సర్వ
దా పండితగోష్ఠీశాలీ వితరణ విద్యావరద్య శ్చ స్సన్నిహాలోకే సర్వప్రజాఽదృష్ట వశా
దనయోః పుత్రస్సన్నుదితో విజయత ఇతిభావః. అత్ర శ్లేషాను ప్రాణితో రూపకాల
ఙ్కారః. వృత్తంతు పూర్వోక్తమేవ.

టీ. ఈదంపతుల పుత్రుని బిరుదనామములు మొదలగునవి చెప్పదలంచినవాఁడై
ముందు ముఖ్యనామమును చెప్పుచున్నాఁడు. సుమనస్సుగంధః, సుమనః=పండితుల
యొక్క, సుగంధః = మంచిసంబంధము కలిగిన యని రాజపక్షము. సుమనస్సుగంధః,
సుమనః = పుష్పములయొక్క, సుగంధః = సువాసనగలిగిన యని గాని, సుమనస్సు
గంధః, సుమనః=దేవతలయొక్క, సుగంధః=మంచిసంబంధము కలిగిన యని గాని సుర
తరుపక్షము. ఈపద ముభయ విశేషణము. అపారకృపారసోద్యద్దృక్పూరసార
చరితార్థవరార్థిసార్థః, అపార=అవధిలేని, కృపారస = కరుణారసముచేతను, ఉద్య
త్ = ఒప్పుచున్న, దృక్ = చూపులయొక్క, పూర=సంపుయొక్క, సార=నిగ్గుచే,
చరితార్థ = కృతార్థులగుటచే, వర = శ్రేష్ఠులైన, అర్థి=యాచకులయొక్క, సార్థః =
సంపుగలిగిన, ఈపదము రాజవిశేషణము ; అయం=ఈపరిదృశ్యమానుఁడగు, శ్రీసూర్య
రాట్సురతరుః, శ్రీసూర్యరాట్, శ్రీ=శ్రీమంతుఁడగు, సూర్యరాట్=సూర్యరాయప్రభుఁ
డను, సురతరుః = కల్పవృక్షము, తయోః=తుంగయాంబా రామరాయ ప్రభువులకు,
పుత్రస్సన్=కుమారుఁడై, పృథ్వీతలే= భూలోకమునందు, జన=మనుజులయొక్క, భా
గ్యహేతోః = అదృష్టవశంబున, విజయతే = సర్వోత్కర్షముగా నుండును. అనఁగా
వీరిపుత్రుఁడగు శ్రీసూర్యరాయ ప్రభువు. సర్వదా పండితగోష్ఠిగలవాఁడై వితరణ విద్యా
ధురీణుఁడై యిహలోకమునఁ బ్రజల యదృష్టవశమున సర్వోత్కృష్టముగానుండునని
భావము. ఈశ్లోకమున శ్లేషానుప్రాణిత మగు రూపకాలంకారము. వసంతతిలక
వృత్తము.

శ్లో॥ వేఙ్కట కుమార మహీపతి సూర్యా-
భిఖ్యం చకారసుత మాత్మసమమ్,

తత్తద్గుణానురూప్యాదస్య,
పితా భావిచరిత్రవేత్తాహి. ౧౨,

ఉ. ఈవిభునయ్యరామధరణీశ్వరుఁ డాత్మసముం గుమారు నిం
పావహిలంగఁ దత్తదుపమార్హ గుణానుగుణప్రశక్తిసం
భావనఁ జేసి వేంకట కుమార మహీపతి సూర్య నాముఁగాఁ
దా వెలయించె భావిచరితంబు నెఱింగినవాఁడుగావునన్. ౧౨.

వ్యా. అథ, తస్యముఖ్యనామ వివిచ్య ఉపపదాని వివృణోతి. వేంకటేతి-అస్య కుమారస్య పితా=జనకః ఆత్మసమం=శౌర్యధైర్యాదిగుణైస్స్వసమానం, సుతం=పుత్రం, తత్తద్గుణానురూప్యాత్, తత్తద్గుణానాం అనురూప్యాత్=అనుగుణ్యాత్, వేంకట కుమార మహీపతి సూర్యాభిఖ్యం=వేంకట కుమార మహీపతి సూర్య ఇతి. అభిఖ్యా యస్యసతథోక్తం, చకార=అకరోత్, తస్మాత్-భావిచరితవేత్తా, భావినః=భవిష్యతః చరితస్య=చారిత్రస్య, వేత్తాహి=జ్ఞాతాఖలు. పావనత్వ శక్తికారుణ్య ప్రతాపగుణైః ప్రసిద్ధో భవిష్యతీతి నిశ్చిత్యేత్యర్థః. పావనత్వేన,వేంకటః-వేం=పాపం, కటతి=హరతీతి, వేంకటః=శ్రీనివాసః, ప్రసిద్ధో వేంకటాచలస్వామీ, శక్త్యా=సామర్థ్యేన, కుమారః=స్కందః, కారుణ్యేన, మహీపతి ర్మహ్యా భువః-పతిః=భర్తా, శ్రీహరిః, ప్రతాపేన, మహసా, సూర్యస్తపన స్తేషా మభి ఖ్యేవాభిఖ్యాశోభేవ, శోభా యస్యసతథోక్తం చకారేతి భావః. ఆర్యావృత్తం. 'ఆర్యాయాస్సప్తగణా గోపేతా భవతి నేహ విష మేజః, షష్ఠోయం న్లలఘూవా' ఇతి.

టీ. అస్య=ఈరాజకుమారునియొక్క. పితా=తండ్రియగు రామరాయవిభుఁడు, ఆత్మసమం-ఆత్మ=తనతోడ, సమం=సమానుఁడగు, సుతం=కుమారుఁడైనకృతినాయకుని తత్తద్గుణానురూప్యాత్, తత్తత్=ఆయాయీ, గుణ=పావనత్వాదిగుణములయొక్క, అనురూప్యాత్=అనుగుణత్వమువలన, వేంకటకుమార మహీపతి సూర్యాభిఖ్యం=వేంకట కుమార మహీపతి సూర్య రాజు అను పేరుగలవానిఁగ,చకార=చేసెను. భావిచరితవేత్తాహి, భావి=రాఁగల, చరిత=చరిత్రములను, వేత్తాహి=తెలిసికొను వాఁడుగదా. దానివలన ఈకార్యము చేసెనని భావము. ఎందువలననఁగా-వేం=పాపమును, కటతి=ఖండించు వాఁడుగావున వేంకటః=వేంకటేశ్వరుఁడు, అతనిసామ్యము; పావనత్వము, కుమారః=

కుమారస్వామి - అతనిసామ్యము - శక్తి, మహిపతిః=భూభర్తయగు నారాయణభూర్తి-అతనిసామ్యము. కారుణ్యము, సూర్యః=సూర్యుఁడు, అతనిసామ్యముప్రతాపము, ఇవి గలవాఁడుగావున సార్థకనామధేయుఁడైనందున నీవిభునితండ్రియగురామవిభుఁడు భావిచరితవేత్తయని భావము.

శ్లో. సుధీరయం ధీరధియాం మధీన, స్స్వధీతవిద్యః ప్రథితానుభావః
సుధాశనాచార్యసమః ప్రబోధే,సమేధతే రామనృపాలబాలః.

గీ. ధీరధీవశ్యుఁ డాతఁ డంధీతవిద్యుఁ
డధికధీశాలి సుప్రథితానుభావుఁ
డలరుచుండుఁ బ్రబోధసుధాశగురుఁడు
రామవసుధాధినాథు నాంరససుతుండు. ౧౩

వ్యా. అస్య కుమారస్య విద్యావినయాది గుణా న్నిరూపయతి. సుధీరితి. అయం=పరిదృశ్యమానః రామనృపాలబాలః, నౄన్-పాలయతీతి నృపాలః, రామ ఇతి నృపాలః, రామనృపాల స్తస్య బాలః పుత్రః కర్తా-శోభనాధీర్యస్య సః సుధీ రతఏవ ధీరధియాం=పండితానాం-ధృతిమతాం వా, అధీనః=వశ్యః స్వధీతవిద్యః=సుష్ఠుయథాతథా, అధీతా=అభ్యస్తావిద్యా శ్చతుష్షష్టికళా, యస్యసతథోక్తః. అత ఏవ ప్రథితానుభావః, ప్రథితః=ప్రసిద్ధోనుభావో=మహిమా-యస్యసః-ప్రబోధే-జ్ఞానే, సుధాశనాచార్యసమః. సుధా=అమృత మశనంయేషాం తేసుధాశనా=దేవా స్తేషామాచార్యః=ఉపాధ్యాయ స్తేన సమః, బృహస్పతిసమానబుద్ధిస్స న్నిత్యర్థః, అనేన సాత్త్వికాహారాణాం బుద్ధ్యతిశయం సూచ్యతే, సమేధతే=చకాస్తి, ఏధదీప్తావితిధాతో రాత్మనేపదం. అయంధీశాలితయా పండితాధీనోభ్యస్తవిద్యశ్చ సన్నతఏవ ప్రసిద్ధమహిమా బృహస్పతి సమానమహిమాసన్ప్రకాశత ఇతిభావః. వృత్త్యనుప్రాసఇతి శబ్దాలఙ్కారః. వృత్తముపజాతిః.

టీ. ఈశ్లోకమున నీవిభుని విద్యా వినయ వివేకాదిసంపదను నిరూపించుచున్నాఁడు. అయం=ఈ, రామనృపాలబాలః=రామరాయనృపసూనుఁడు, సుధీః=మంచిమేధగలవాఁడుగనుక నే, ధీరధియాం=పండితులకుఁగాని-ధృతిమంతులకుఁగాని, అధీనః=వశ్యుఁడై, స్వధీతవిద్యః, సు=లెస్సగా, అధీత=అభ్యసింపఁబడిన, విద్యః = చతుష్షష్టికళలుగలవాఁడగుచు, ప్రథితానుభావః, ప్రథిత=ప్రసిద్ధమైన, అనుభావః=మహిమగలవాఁడగుచున్న,

ప్రబోధే=తెలివియందు, సుధాశనాచార్యసమః, సుధాశన=దేవతలకు, ఆచార్య=గురు వగునట్టి బృహస్పతితో, సమః=సమానుఁడై, సమేధతే=లెస్సగాఁ బ్రకాశించుచున్నాఁడు ఈరాజకుమారుఁడు మంచిబుద్ధిగలిగావునఁ బెద్దలకువకుఁడును సభ్యస్థవిద్యుఁడగు టచేఁ బ్రసిద్ధమగు మహిమగలవాఁడును బ్రతిభచే బృహస్పతికిసమానుఁడునై లెస్సఁగఁ బ్రకాశించుచున్నాఁడని యభిప్రాయము. ఈశ్లోకమున వృత్త్యనుప్రాస మనుశబ్దాల ఙ్కారము. వృత్త ముపజాతి.

శ్లో. భాషేయ మఖిలాస్మాకం, బాలేన మని తామునా
ఇత్యపత్రపయానూనం, హూణాస్స ర్వేసితాననాః. ౧౪.

గీ. బాలుఁ డగు నీతఁ డీమన•భాష నెల్లఁ
దెల్లముగ నేర్చికొనియెను•దెలివి ననుచు
నెల్లహూణులుఁ బూనిరి•వెల్లఁదనము
నాన చేసికుఁ-వంబుగ•నాననముల. ౧౪

వ్యా. నాయంచతుష్షష్టి కళాపూర్ణమాత్రః, కింతు, సకలదేశద్వీపభాషాప్ర వీణశ్చేత్యాహ. భాషేతి. సర్వే=సమస్తాహూణా, అస్మాకం=వస్సంబంధినీ భాషా జాతీ యావాగిత్యర్థః,అమునా=అనేనబాలేన-సంపూర్ణవయసైవ, అఖిలా=సమగ్రం, మనితా= లోడితా అభ్యస్తేతి యావత్, ఇత్యేవ మపత్రపయా=లజ్జయా, చిరకాలాభ్యాసశాలిభిః ప్రవయసోభిరప్యస్మాభి రజ్ఞాతరహస్య సంప్రదాయాస్మాకీనా సర్వాభాషా వ్యతిశీఘ్రకా లాభ్యాస మాత్రతో జ్ఞాతేతి హ్రీయేతి భావః, సితా నవాః, సితా న్యాననాని యేషాంతే తథోక్తాః అభూవన్నితి శేషః. నూనం ధ్రువ మిత్యుత్ప్రేక్షాలఙ్కారః. వృత్తమనుష్టుప్.

టీ. ఇతఁడుచతుష్షష్టికళాపూర్ణమాత్రుఁడేగాక సకలదేశద్వీపభాషా ప్రవీణుఁడు నగుచున్నవని చెప్పుచున్నాఁడు. సర్వే=ఎల్లరగు, హూణాః=అంగ్లేయులు, అస్మాకం=మా సంబంధమగు-ఇయం=ఈభాష-అనఁగా స్వజాతిభాష, అమునా=ఈ, బాలేన=పిన్నవయ సువానిచే, అఖిలా=అంతయు, మనితా=మననము చేయఁబడె, ఇతి=ఇట్లన్న, అపత్రప యా=లజ్జచేతను. చిరకాలమునుండియభ్యసించుచున్న పెద్దవయస్సుగలమనలచేఁ దెలిసి కొనఁబడని రహస్యసంప్రదాయములతో నీయనభాషనంతయు నతి శీఘ్రమున నుపదేశ

మాత్రమున నీచిన్న వయసువానిచే నేర్పుగానఁబడెనను నిశ్చయతవని భావము. సితా
ననాః-సిత=తెల్లనగు-ఆననాః=మోములుగలవారు, అభూవన్=అయిరి యని యధ్యా
హార్యము. ఉత్ప్రేక్షాలంకారము.

శ్లో. చతుష్షష్టికళాపూర్ణా, స్సర్వేప్యస్యసభాసదః
తత్సామ్యే షోడశకళా,పూర్ణస్స్యా త్పాదమాత్రకః. ౧౫.

కం. అఱువదినాలుగుకళలం
బరిపూర్ణులు తలఁపఁ దత్సభాసదు లెల్లన్
సరియె శశి షోడశకళా
భరితుఁడు వారలకుఁ బాదభాగుం డరయన్. ౧౫.

వ్యా. అయంతు సన్వయమేవ సకలకళాపూర్ణ స్తస్యసభాసద స్సర్వేపి చతుష్ష
ష్టికళాపూర్ణా ఇత్యాహ. చతురితి. అస్యకుమారస్య సభాసదః= సభాస్తారా స్సర్వేపి
అపి, చతుష్షష్టికళాపూర్ణాః=చతుష్షష్టిసంఖ్యాకాభిః కలాభిః పూర్ణా=భరితా స్తత్సామ్యే
తేషాంసమత్వేసతి, షోడశకళాపూర్ణః=షోడశసంఖ్యాభిః కలాభింశుభిఃపూర్ణః=భరి
తత్వభ్యాహార్యః, పాదమాత్రకశ్చతుర్థాంశమాత్రకస్స్యాత్-భవేత్. అస్య చతుష్షష్టి
సకలాకలాపూర్ణానాం, పూర్ణస్య చంద్రస్య-పాదమాత్రతోక్తే రసంబంధే సంబంధా
తిశయోక్తిరలఙ్కారః. వృత్తమనుష్టుప్.

తా. ఈరాజకుమారుఁడు తామాత్రమే గాక తన పండితులనఁగాఁ దనసభకు
వచ్చువారెల్లరను చతుష్షష్టికళాపూర్ణులుగా నియమించుకొన్నాఁడని చెప్పుచున్నాఁడు.
అస్య = ఈరాజకుమారునియొక్క, సభాసదః = సభలోని పండితులు, సర్వేపి = అంద
ఱును, చతుష్షష్టికళాపూర్ణాః, చతుష్షష్టి = అఱువదినాలుగు, కలా = విద్యలచే, పూ
ర్ణాః=సంపూర్ణులు, తత్సామ్యే - తత్ =వారియొక్క, సామ్యే=సాటియందు, షోడశ
కళాపూర్ణః - షోడశ=పదియాఱగు, కలా = కళలచే, పూర్ణః = భరితుఁడగు, శశీ =
చంద్రుఁడు - ఈ పదము ధ్యాహార్యము. పాదమాత్రకః = నాల్గవపాలివాఁడు, స్యాత్,
అగును. ఈ శ్లోకమున నసంబంధమునందు సంబంధాతిశయోక్త్యలంకారము. వృత్త
మనుష్టుప్పు.

శ్లో. యశఃపటహతామియాత్, సమ్రాజశ్చతురర్ణవీ
దానక్షాత్రధురీణస్య, సూర్యరాయ మహీపతేః. ౧౬.

గీ. దానశౌర్యంబులను జగత్ప్రథితుఁడైన
సూర్యరాయమహీపతిక్షోణిఁ బూనఁ
బ్రబిమలం బగుచతురంబురాసు లెలమి
నమితసత్కీర్తిపటహత్వమందు చుండు. ౧౬.

వ్యా. ఇతః పూర్వం వైదుష్యముక్త్వా తతో దానక్షాత్రే వర్ణయతి. యశ ఇతి. క్షతాత్త్రాయత ఇతి క్షత్త్రం, తస్యభావః క్షాత్త్రం - దానంచ - క్షాత్రంచ - దానక్షాత్రే, తయోర్ధురీణస్య = భారవహన సమర్థస్య - సమ్రాజస్సార్వభౌమస్య, సూర్యరాయ మహీపతేః = సూర్యరాయ ప్రభోః, చతుర్ణా మర్ణవానాం సమాహారశ్చతురర్ణవీ = సముద్రచతుష్టయం, కర్తృ - యశః పటహతాం, కీర్తిడిండిమతా మియాత్ = ప్రాప్నుయాత్. అత్రాపిచాసంబంధే సంబంధాతిశయోక్తిరలఙ్కారః, వృత్తమనుష్టుప్.

టీ. తొలుతఁ గృతినాయకుని పాండిత్యమువివరించి తరువాత దానక్షాత్రములం జెప్పుచున్నాఁడు. చతురర్ణవీ=సముద్ర చతుష్టయము, దానక్షాత్రధురీణస్య, దాన = దాతృత్వముయొక్కయు, క్షాత్ర = శౌర్యముయొక్కయు, ధురీణస్య = భారమును బూనిన, సమ్రాజః=సార్వభౌముఁడగు, సూర్యరాయ మహీపతేః=సూర్యరాయ ప్రభు సంబంధమగు, యశఃపటహతాం=కీర్తిడిండిమత్వమును, ఇయాత్ =పొందుఁగాక. వృత్తాలంకారములు పూర్వోక్తములు.

శ్లో. శ్రీసూర్యరాయస్య నరేంద్రమౌళేః, ర్జయప్రవృత్తిశ్రవణేన శేషః
హృష్టస్సితం కేతుపటచ్ఛలేన, ఫణాగ్ర మున్నమ్యసునృత్యతీవ. ౧౭.

చ. సురుచిరశౌర్యశాలి యగుసూర్యనరేంద్రుఁజయప్రవృత్తి న
య్యురగకులాధినేత వినియుత్సుకవృత్తిఁ దలిర్చునట్ల సుం
దరసితధ్వజాగ్రపటదంభమునం దనదౌపటాంచలం
బిరవుగ మీఁది కెత్తి నటియించుచునుండు ననంగఁజెల్వగున్. ౧౭.

వ్యా॥ ఇతః పూర్వ మస్యదానపాత్రప్రవృత్తి గుణవర్ణనం కృత్వా, ధౌరంధర్య మిదానీం వర్ణయతి. శ్రీసూర్యరాయస్యేతి. శేషః=అనంతః, నరేంద్రమాళేః, నరాణాం=మానవానా మింద్రాః=ప్రభవో నరేంద్రాః, రాజానస్తేషాం మాళిః=శిరోభూషణం. తస్య-నరేంద్రాణాం వ్యాళగ్రాహిణాం మాళే శ్శ్రేష్ఠస్యవా- శ్రీసూర్యరాయస్య - శ్రీమత స్సూర్యరాయ ప్రభోర్జయప్రవృత్తిశ్రవణేన=జయవార్తాకర్ణనేన వి. (వార్తాప్రవృత్తి ర్వృత్తాంత' ఇత్యమరః. హృష్టః=సంతుష్టస్సన్, కేతుపటచ్ఛలేన=కృత్తిపతిధ్వజపతాకా వ్యాజేనేత్యర్థః. సితం=శ్వేతం, ఫణాగ్రం=స్ఫటాంచలమున్నమ్య=ఊర్ధ్వీకృత్య-నృత్యతీవ. సతతం నృత్యతీవ స్థిత ఇత్యుత్ప్రేక్షా. అత్రనరేంద్రమాళేరస్య జయవార్తాశ్రవణేన సర్పరాజస్య కథంహర్ష ఇతి నాశంకనీయం, కుత ఇతిచే ద్వ్యాళవ్యాళగ్రాహిణాం పరస్పరవిరోధస్స్యాత్తన్నరేంద్రజయవార్తాశ్రవణేన చిరకాలస్వశిరోనిష్ఠం భూభువనభార స్తద్భుజాగ్రేణధృత ఇతి ప్రీత్యా హర్షోత్పత్తిరతఏవ-స్వైరం ఫణాగ్ర, స్యోన్నమనం, కృతవానిత్యుక్తమత్ర. శ్లేషానుప్రాణితకైతవాపహ్నుత్య సంబంధే సంబంధాతిశయో క్త్యుత్ప్రేక్షాణాంసంసృష్టిః. వృత్తముపజాతిః.

టీ. శేషః=అనంతుఁడు, నరేంద్రమాళేః, నరేంద్ర=రాజులకుఁగాని, పాములకు బట్టువాండ్రకుఁగాని, మాళేః=శిరోభూషణమగు, శ్రీసూర్యరాయస్య, శ్రీ=శ్రీమంతుఁడగు, సూర్యరాయస్య=సూర్యరాయప్రభువుయొక్క, జయప్రవృత్తిశ్రవణేన, జయప్రవృత్తి=జయవార్తయొక్క, శ్రవణేన=వినికిచేత, హృష్టః=సంతసించినవాఁడై, సితం=శ్వేతవర్ణముగల, ఫణాగ్రం-ఫణా=పడగయొక్క, అగ్రం=ఉపరిభాగమును ఉన్నమ్య=పైకెత్తి, నృత్యతీవ = మిక్కిలియొప్పగానటించుచున్నవానివలెనే యుండు నని యుత్ప్రేక్ష. విషవైద్యుని జయవార్తను వినుటవలన సర్పమునకు సంతోషము గలుగు నాయని శంకింపవలదు. ఏమన—నీవైరము జాతిసామాన్యనిష్ఠము విశేషనిష్ఠముగాదు. మఱియునీనరేంద్రుజయవార్త వినుటవలన నీసర్పవిశేషశేషునకుఁజిరకాలముఁనుండితనశిరస్సునందున్న భూధరణభారము నీతనిబాహాగ్రమునఁ బాల్పుఁగావునదే స్వచ్ఛముగాఁబడగనెత్తుట గలిగెను గాన సంతోషసిద్ధి యగుట్యేనిభావము. ఈశ్లోకమున శ్లేషానుప్రాణితకైతవాపహ్నుత్యతిసంబంధా సంబంధాతిశయోక్త్యుత్ప్రేక్షలకు సంసృష్టి. వృత్తముపజాతి.

శ్లో. వనీపకానా మవనీపకానాం, విపర్యయస్స్యా ద్వ్యాహితోపి వృత్త్యోః ।
అస్మిన్ భువం బిభ్రతి సూర్యరాయే, దానేన శౌర్యేణ జగత్ప్రసిద్ధే ॥

గీ. దానశౌర్యంబులను జగత్ప్రథితుఁ డైన
సూర్యరాయమహీపతి క్షోణిఁ బూన
వరుసగ వనీపకావనీపకుల విహిత
వృత్తులు వహించుచుండును వినిమయంబు. ౧౮.

వ్యా. తస్య దానశౌర్యధురీణతయా ఫలమాహ. వనీపకానామితి. దానేన=త్యాగేన, శౌర్యేణ=ప్రతాపేన చ, జగత్ప్రసిద్ధే - జగతి=లోకే, ప్రసిద్ధే=విఖ్యాతే - అస్మిన్ సూర్యరాయే=ఏతత్సూర్యరాయాఖ్యప్రభౌ, మహీం=భువం - బిభ్రతి సతి, వనీపకానాం=అర్థినాం. ని. 'వనీపకో యాచనకః' ఇత్యమరః. అవనీపకానామపి చ, అవనీం=భూమిం, పాంతీత్యవనీపాః స్వార్థే కప్రత్యయః తేషామవనీపకానాం చ - వృత్త్యోః= వ్యాపారయోః వినిమయః=విపర్యయో - విహితో, నిర్ణీతస్స్యాదిత్యర్థః. వనీపకానాం విహితయాచ్ఞాయా - అవనీపకానాం విహితపాలనస్య చ విపర్యయశ్చే ద్వనీపకనిష్ఠ యాచ్ఞా ఽవనీపకేష్వవనీపకనిష్ఠ పాలనధర్మో వనీపకేషు చ సంక్రమే దితి భావః. అత్ర వినిమయాలఙ్కారః.

టీ. దానశౌర్యశాలి యగుటకు ఫలమును జెప్పుచున్నాఁడు. దానేన=ఈవిచేతను, శౌర్యేణ=ప్రతాపముచేతను, జగత్ప్రసిద్ధే = లోకవిఖ్యాతుఁడగు, అస్మిన్ = ఈ, సూర్యరాయే=సూర్యరాయప్రభువు, భువం=భూమిని, బిభ్రతి=భరించినవాఁడగుచుండఁగా, వనీపకానాం = యాచకులయొక్కయు, అవనీపకానాం శత్రురాజులయొక్కయు, వృత్త్యోః = యాచనాపాలనారూపములగువ్యాపారములకు, విపర్యయః= విపర్యాసము, విహితః = నిశ్చితమైనది, స్యాద్ధి = అగునుగదా. అనఁగా నీతని యధికారమున, యాచకుల యాచనయొక్కయు, భూపతుల పాలనముయొక్కయు, వ్యాపారములకనఁగా యాచనావనీపాలనారూపవ్యాపారములకు వినిమయ మగు ననఁగా యాచకులు భూపాలురును భూపాలురు యాచకులు నగుదురని భావము.

శ్లో. సపీతికాఖ్యాం నిజరాజధానీం
స్వపూర్వకాధిష్ఠితహేమసౌధామ్
ప్రపూరయన్ ఛ్రీభిరజస్రమాస్తే
ప్రపా మివ స్వాదుజలై స్స్వసత్రః. ౧౯

చ. అతఁడు స్వరాజధానియు నిజాన్వయపూర్వకభూమిరాడధి
ష్ఠితమణిహేమసౌధయుఁ బ్రసిద్ధయు నౌపురుహూతికాపురి
న్సతము సుసత్రకారకుఁడు స్వాదువు లౌనుదకంబులం బ్రపా
యతనమునం బలె న్సిరుల నారయ నించుచునుండు నిండుగన్. ౧౯.

వ్యా. అథస్వవర్ణాభిజన గోత్ర మాతాపితృనామ స్థలిరుదాదీ న్యుక్త్వానిజరాజ
ధానీసంజ్ఞాంసంజ్ఞాపయతి. సఇతిః,సః=సూర్యరాయప్రభుః, స్వపూర్వకాధిష్ఠితహేమ
సౌధాం, స్వస్య=ఆత్మనః-పూర్వే-తఏవ-స్వపూర్వకాః స్వార్థేకప్రత్యయః, ఆత్మవంశజ
వృద్ధాఇత్యర్థః. తైరధిష్ఠితా=అధ్యుషితా, హేమమయా=హిరణ్మయా, సౌధా=హర్మ్యాణి
యస్యాం-సాతథోక్తాం, పీఠికాఖ్యాం=పీఠపురనామ్నీం, పురుహూతికాపురమితియా
వత్, స్వరాజధానీం=స్వస్యాత్మనోనివాసనగరీం, శ్రీభిః = సంపద్భిరైశ్వర్యైరితియా
వత్, సుసత్రః-సత స్త్రాయత ఇతి సత్త్రం ధర్మః శోభనం-సత్త్రం ధర్మో యస్యసః
సుసత్రః, పురుషః ఇతిశేషః, ప్రపాం-పానీయశాలాం; ని, ప్రపా పానీయశాలి కేత్య
మరః. స్వాదుజలైరివ=మధురోదకైరివ, అజస్రం=సర్వదా, ప్రపూరయ-అభిపూరయ
న్నాస్తే=వర్తతే, స్వరాజధానీం సర్వసంపత్సంపూర్ణాంకుర్వన్నాస్త ఇతిభావః, పూర్ణోప
మాలఙ్కారః. ఉపజాతివృత్తమ్

టీ. సః = ఆప్రభువు, స్వపూర్వకాధిష్ఠితహేమసౌధాం, స్వ = తనయొక్క,
పూర్వకైః=కులవృద్ధులచేత, అధిష్ఠిత=అధిష్ఠింపఁబడిన హేమసౌధాం=బంగారుమేడలు
గలిగినట్టియు, పీఠికాఖ్యాం=పీఠపురమను పేరుగలిగినట్టియు, రాజధానీం=రాజధానిని,
సుసత్త్రః = మంచిధర్మముగలపురుషుఁడు, ప్రపాం = చలిపందిలిని, స్వాదుజలైరివ,
స్వాదు=మధురములగు, జలైరివ=ఉదకములచేతనుబలెను, అజస్రం=ఎల్లప్పుడును, శ్రీభిః=
సంపదలచే, ప్రపూరయన్=నింపించుకొనుచు, ఆస్తే=నివసించుచున్నాఁడు, అనఁగా-
సకలస్వవంశజననిర్విశేషముగాఁ దన రాజధానిలో నిజముల సందఱు సకలసంపత్సం
పూర్ణులఁ గావించుచుండునని భావము. పూర్ణోపమాలంకారము. వృత్త ముపజాతి.

శ్లో. సర్వాగావ స్సకలవిభవాః కామదోగ్ధ్రీస్స్వభావా
స్సర్వే విప్రా నవనవధియ స్స్వర్ణివాసార్యదీప్రాః

స ర్వే వృక్షా స్సతతఫలినః కల్పవృక్షైః స్సదృక్షా
స్స్వర్వాసభూమి స్సుమహామహితా సూర్యరాయస్య రాష్ట్రే॥

సీ. సకలవైభవమైన సకలధేనుగణంబు
ధృతసారసారభేయీగణంబు
నవనవప్రజ్ఞావిభవసమంచితులైన
సర్వవిప్రులు సురాచార్యదీప్రు
లవిరతకిసలప్రసవఫలాఢ్యములైన
సకలవృక్షములు కల్పకసదృక్ష
ములు నిఖిలక్షమావలయంబు ధనధాన్య
బహుభోగభాగ్యోత్సవసుఖనిలయ
మగుచుఁ దగుచుండు గణ్యపుణ్యప్రవర్త
నానురక్తజనస్వాంతుఁడైన శ్రీకు
మార వేంకట సూర్య రాణ్మనుజవిభుఁడు
మించునైపుణి ధరణిఁ బాలించునపుడు. ౨౦.

వ్యా. అథ తస్యపాలన విశేషేణ రాజధాన్యామేవ సతురాష్ట్రే సర్వత్రాపి సర్వసమృద్ధయ స్సంతీత్యుచ్యతే. సర్వా ఇతి. సూర్యరాయస్య = సూర్యరాయప్రభోః, రాష్ట్రే=రాజమండలే,సర్వత్రాపీత్యర్థః, సకలవిభవాః,సకలః=దానవిభవశాలీ-వి. సుక లోదాత్మభోక్తరీత్యమరః. విభవస్సంపద్యాసాంతా స్తథోక్తాః; సర్వాః=సమస్తా-గా వః=సురభయః, కామదోగ్ధ్రీస్వభావాః-కామాన్=వాంఛాఫలాని - దుహ్యతీతి-కామ దోగ్ధ్రీస్వర్థేన-స్తస్యాస్స్వభావ ఇవ స్వభావో యాసాం తా స్తాదృశాః, నవనవధియః-నవ నవాః=ప్రత్యగ్రా, ధీస్సుద్ధి ర్యేషాం తే తథోక్తా-నవనవోన్మేషధీశాలిన ఇత్యర్థః, సర్వే=సమ స్తా విప్రాః=బ్రాహ్మణాః, స్వర్నివాసార్యదీప్రాః, స్వర్=స్వర్గో, నివాసో-వసతి ర్యేషాం తే స్వర్నివాసా దేవా స్తేషా, మార్యః=పూజ్యః గురుఃబృహస్పతిరిత్యర్థః, స-ఇవదీప్రాః=ప్రకాశమా నాః-ధిషణాధిషణా ఇత్యర్థః. సతతఫలినః-ఫలా న్యేషాం సంతీతి ఫలినః, ఫలవంత స్సత తం-సర్వర్తుషు ఫలిన స్సంతత ఫలినః-సర్వే=సమస్తా, వృక్షాః=తరవః, కల్పవృక్షైః=కల్ప

ద్రుమపంచకేన-సద్వృక్షాః=సమానాః, సర్వదాపి కిసలయకుసుమకలాటుఫలధరితా ఇత్యర్థః. సర్వా=సమస్తా, భూమిః=ధరణీ, సుమహామహితా - శోభనాః మహాఃఉత్సవాః=సుమహాః-తైర్మహితా శ్రేష్ఠా - మహితోత్సవశాలినీత్యర్థః. ఏతేనసర్వేష్వేతాదృశవిభవాస్సంతస్సదాదృశ్యత ఇతిభావః. ఉదాత్తాలఙ్కారః. సమృద్ధమద్వస్తువర్ణనముదాత్తాలఙ్కార ఇత్యుక్తత్వాత్ మందాక్రాంతావృత్తం. మందాక్రాంతాజలధిషడగైర్మ్భౌ నతౌ గురూచ.

టీ. ఇంతకు మున్ను తనపాలన విశేషంబున రాజధానియందుమాత్రమున నైశ్వర్యాతిశయంబులం జెప్పి యిప్పుడురాష్ట్రసమృద్ధిం జెప్పుచున్నాఁడు. సూర్యరాయస్య=సూర్య రాయప్రభునియొక్క, రాష్ట్రే=రాజ్యమండలమునందు, సుకలవిభవాః=దాసభోగవైభవములుగల, గావః=గోవులు, సర్వా=అన్నియును, కామదోగ్ధ్రీస్వభావాః, కామదోగ్ధ్రీ=కామధేనువుతో సమానమగు, స్వభావా=స్వభావముగలవియు, నవనవధియః-నవనవ=నవనవోన్మేషముగల, ధియః=బుద్ధిగలిగిన, విప్రాః=బ్రాహ్మణులు, సర్వే=అందఱును, స్వర్నివాసార్యదీప్రాః-స్వర్=స్వర్గము, నివాస = నివాసముగలవారు దేవతలు, వారిత ఆర్య=పూజ్యుఁడగుబృహస్పతివలె, దీప్రాః=ప్రకాశమానులు. సతతఫలినః, సతత=ఎల్లప్పుడును, ఫలినః=ఫలవంతములగు వృక్షాః=తరువులు, సర్వే=అన్నియును, కల్పవృక్షైః=కల్పవృక్షపంచకముతో, సవృక్షాః=సమానమైనవియు, భూమిః=ధాత్రి, సర్వా=అంతయును, సుమహామహితా, సు=యోగ్యమైన, మహ=ఉత్సవములచేత = మహితా=కొనియాడఁబడినదియు నగుచున్నది. ఇట్లుచెప్పుటచేఁ జరాచరములన్నియును సర్వసంపత్సంపూర్ణములైయున్నవని యభిప్రాయము. ఉదాత్తాలంకారము, మందాక్రాంతావృత్తము

శ్లో. శ్లోకాశ్శ్రీసూర్యరాయ స్యాభ్యుదయప్రతిపాదకాః
ద్విషన్మనోభిదో రామ,ధాటీవచ్చైకవింశతిః, ౨౧.

కం. శ్లోకములు సూర్యరాయ
క్ష్మాకాంతాభ్యుదయవృద్ధిఘటకములు ద్విష
ద్భీకరము లేకవింశతి
యై కడుభృగురాముధాటులనఁగఁదలిర్చెన్.

వ్యా. శ్రీసూర్యరాయస్య = శ్రీసూర్యరాయప్రభోః. అభ్యుదయ ప్రతిపాదకాః = అభ్యుదయసంపాదకాః, శ్లోకాః = పద్యాని, రామధాటీవత్, రామస్య ధాటీవత్ - రామధాటీవత్, రామస్య = పరశురామస్య ధాటీవత్ = జైత్రయాత్రా ఇవ, ద్విషన్మనోభిదః, ద్విషతాం=శత్రూణాం; మనాంసి=హృదయాని, భిందంతీతి. ద్విషన్మనోభిదః - రిపుహృదయభేద నశ్చైకవింశతిః=ఏకవింశతి సంఖ్యాకాః, ఉభయత్రాపి రిపుహృదయభేద నైకవింశతి సంఖ్యావత్త్వంతుల్యం-అత్రోపమాలఙ్కారః.

టీ. శ్రీసూర్యరాయస్య = శ్రీసూర్యరాయ ప్రభువుయొక్క, అభ్యుదయ ప్రతిపాదకాః, అభ్యుదయ = అభివృద్ధికి, ప్రతిపాదకాః= సంపాదకములగు, శ్లోకాః=పద్యములు, రామధాటీవత్, రామ = పరశురాములవారియొక్క, ధాటీవత్ =జైత్రయాత్రలవలె, ద్విషన్మనోభిదః, ద్విషత్ =శత్రువులయొక్క, మనః=హృదయములను, భిదః= భేదించునవియును, ఏకవింశతిః= ఏకవింశతి సంఖ్యాకములును అయి యొప్పుచున్నవి ఇందుపమాలంకారము, వృత్తమనుష్టుప్పు. శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ



శ్రీరామచంద్రాయనమః.

# ఆంధ్రకుమారశతకపీఠిక.



రఘువంశక్షీర
క్షీరధిపరిపూర్ణసోమ సీతారామా!
స్ఫారామలగుణధామా!
తారకనామ! రవిధామ! దశరథరామా!

సీ. కృప దలిర్పఁగఁ జిత్తగింపుము చెలికాని
వంశ వేంకటరాయపార్థివునకు
శ్రీవెంకయాంబికాదేవికిఁ గూర్మినం
దనుఁడు శ్రీసూర్యరాడ్జనవరేణ్య
ధర్మకొండలరాయధరణీశ్వరాచ్యుత
రాయరాడ్వరుల గారాపుఁదమ్ముఁ
డగుచుఁ బెంపొందుచున్నట్టి శ్రీవినజగ
న్నాథరాయేంద్రుఁ డుత్సాహ మొప్పఁ

తే. దనమమాతృష్వసేయుఁ డైతనరుశ్రీకు
మారమహీపతిసూర్యరాణ్మనుజనాథు
పేర శ్రీరావుభాస్కరవిభుఁ డొనర్చి
నట్టిసంస్కృతశతకంబు నరసి ప్రీతి.

కం. నాయందలిపేరిమిచే
స్ఫాయద్గుణ మగుకుమారశతకముఁ దెలుఁగుం

జేయింప నభిలషించుచుఁ
బాయనికుతుకంబుతోడ • వచియించె నిటుల్

తే. ప్రభునిక్షేమంబు గోరువి•శ్వాసపరుల
లోన మావలె ముఖ్యులు•గాన శ్రీకు
మారశతకంబుఁ దెనిఁగింతు • రీర లనుచు
నభిలషింతుము సుబ్బరా•యార్యవర్య!

కం. అన విని నృపసుతుకృతియుఁట
ఘనముగ నిది నీతిబోధ•కంబుఁట దీనిం
దెనిఁగింపఁగలిగె ననుచుఁ
మునుకొని నా నేర్పుపగిదిఁ • బూనితి నిట్టుల్.

శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః.

శ్రీరస్తు.

విఘ్నేశాయనమః.

శుభమస్తు.

# కుమారశతకమ్.



సటీకాన్ధ్రపద్యసహితం ప్రారభ్యతే.

శ్లో. మాతా మఙ్గామ్బికా యస్య, పితా రామమహేశ్వరః
కుమారవ త్కుమారోయం, ప్రాగ్జయ త్వరిమణ్డలమ్. ౧

తే. శ్రీనెసఁగుమంగయాంబ యెవ్వానిజనని
యెవనిజనకుండు రామమహేశ్వరుండొ
యాకుమారుండు వెస గెల్చుఁగాక యలకు
మారవిఖ్యాతగతి నరిమండలంబు. ౧

వ్యాఖ్యానము.

వన్దేహం జానకీజానేః, పదద్వితయ ముత్పహమ్
దృష చైత్రరథదం యత్తు, పాదుకాద్వ్యయరాజ్యదమ్.

అథ శ్రీమాన్ భాస్కరరాయబాహా పద్మనాయకకులతిలకాయమాన రేచర్ల గోత్రపవిత్ర రావువంశముక్తామణిః "కావ్యం యశసేర్థకృతే వ్యవహారవిదే శివేతరక్షతయే, సద్యఃపరనిర్వృతయే కాన్తాసమ్మితతయోపదేశయుజే" ఇత్యాద్యాలఙ్కారికవచనప్రామాణ్యా త్కావ్యస్యానేకశ్రేయస్సాధనతాం కావ్యాలాపాంశ్చ వర్జయేదిత్య స్యాకావ్య విషయతాంచ పశ్యన్ రావువంశజలధి సోమస్య కుమారవేఙ్కటపతినార్యరాయస్య రాజనీతిం బుబోధయిషుః శతయష్టికముక్తాహార మివ శ్లోకోత్తరు

నాయకరత్నఘటితం నీతిశతకం ప్రారభమాణ "ఆశీర్నమస్క్రియావస్తునిర్దేశో వాపి తన్ముఖ" మిత్యాద్యాకరాద్యనుసృతము మాశీరూపం మఙ్గళ న్నిర్దిశతి.

యస్య=శ్రీమద్వేఙ్కటకుమారమహీపతిసూర్యరాయస్య, మాతా=జననీ, మఙ్గామ్బికా=మఙ్గాయామ్బికాభిధానా, అమ్బికేవ మఙ్గా చ : యస్యపితా రామమహేశ్వరః=శ్రీమద్వేఙ్కటమహీపతిగఙ్గాధరరామరాయమహారాజః, మహేశ్వర ఇవ రామశ్చ అభూతాం ; స కుమారః=భర్తృదారకః, కుమారవత్=సాక్షాత్స్కన్ద ఇవ, అరిమణ్డలమ్ = శత్రుసమూహం, ప్రాక్=శీఘ్రం యథా తథా, జయతు=జిత్వావర్తతామ్. వ్యా. అత్ర జి ధాతో రభిభవార్థే సకర్మకత్వం, "జయిర్జయాభిభవయో రాద్యార్థే సావకర్మక" ఇతి.

యద్వా. ప్రాగ్జయ త్వితి ఏకంపదం,స్రజః=పుష్పమాల్యాజ్జాత మితి స్రగ్జం, స్రగ్జమేవ ప్రాగ్జం, స్రగవత్యం స్రక్సదృశమిత్యర్థః. "దేశీయదేశ్యరిపోర్వా భాస్సే దరాద్యర్థా ఇవార్థకా" ఇతిదణ్డ్యాచార్యోక్తత్వాత్. ప్రాగ్జంకరోతు ప్రాగ్జయతు సులభజయ్యం కరోత్వితిభావః. యథా లోకే స్రక్ సుఖోచ్ఛేద్యాభవతి తద్వత్ అస్య అరిమణ్డలమపి సుఖోచ్ఛేద్యం భవత్వితి యావత్. అత్రామ్బికా మహేశ్వరశబ్దయోః పార్వతీపరమేశ్వరార్థకత్వా త్తత్సుతః కుమారః యథాతారకాదీన్ జితవాన్ తథాయమపి సకల మరిమణ్డలం జయ త్వి త్యాశీర్వాదః; అత్ర శత్రుహస్తగతరాజ్యలక్ష్మీ స్స్వశత్రూన్నిర్జిత్య పునః లబ్ధు మశక్యత్వా త్పురస్తా దరిమణ్డలజయరూపాశీర్వచనమఙ్గళం "క్షత్రియో విజయశ్రియే" తివ్యాయేనోక్తం; ఏవ మేవ శ్రీమద్రామాయణే శ్రీరామచన్ద్రంప్రతి దేవాదిభిః "జయస్వ శత్రూ న్నరదేవమేదినీం, ససాగరాం పాలయ శాశ్వతీ స్సమాః, ఇతీవరామం నరదేవసత్కృతం, శుభై ర్వచోభి ర్వివిధై రపూజయ" న్నితి సర్వేష్వాశాస్యేష్వపి ప్రధానతయా శత్రూన్ జయ స్వేత్యుదీరితతయాऽత్రాపి తథైవోక్తమ్.

అన్యోప్యర్థః. అయం కుమారః కుమారవ న్నారాయణ ఇవ కు శ్చ మా చ కుమే, తే రాతి గృహ్ణాతీతి కుమారః. ని॥ "గోత్రా కుః పృథివీ పృథ్వీ" "ఇందిరా లోకమాతా మా రమా మఙ్గళదేవతా" చేత్యుభయత్రాప్యమరః. రా=ఆదానే, స ఇవ అరాణి అస్త్రాః 'అస్యేతి అరి, మణ్డలం భూమణ్డలం తచ్చ తత్ చకుర త్నమహీమణ్డలం జయ త్విత్యర్థః. యద్వా అరే శ్శత్రుసమృద్ధి, మణ్డలం భూమణ్డలం, జయతు=స్వాయత్తం కరోతు.

అపి చ. అయం=పరిదృశ్యమానః, కుమారవత్కుమార ఇత్యేకం పదం, కుమార్యశ్చ కుమారాశ్చ కుమారాః, తే అస్య సన్తీతి కుమారవాన్ స చాసౌ కుమారశ్చ ఏతాదృశః అరిమణ్డలం=అరాణి అస్య సన్తీతి అరి తచ్చ మణ్డలం=చతురన్తమహీమణ్డలం జయత్విత్యర్థః; అనేనాస్య కుమారవత్త్వం సర్వమహీమణ్డలాధిపత్యం చ భవిష్యతీతి ధ్వన్యతే. కిం చాయం కుమారవత్కుమారః (కుశ్చ మా చ రా చ తాసాం సమాహారః కుమారం) కుః=స్త్రీ, మా=సమ్పత్తిః, రా=శాలా, తాసాం సమాహారః కుమారం. నిః "కుర్భూ స్త్రీరవౌః", "శోభా సమ్పత్తి పద్మాసు లక్ష్మీః శ్రీ స్తేన్దిరా రమా" "రాస్త్రియాం హేమ్నిశాలాయా" మితి నానార్థరత్నమాలా. "సర్వో ద్వన్ద్వో విభాషయైకవద్భవతీ" త్యేకవద్భావే నపుంసకత్వం-త దస్యాస్తీతి కుమారవాన్ స చాసౌకుమారః, అరిమణ్డలం, అరీణాం=అన్తశ్శత్రూణాం కామక్రోధలోభమోహాదీనాం, మణ్డలం=సమూహం, జయతు = అభిభవతు. అయ మపి సకలమహీమణ్డలవైభవ మహాలక్ష్మీసమృద్ధిధనరత్నమన్దిరాది సమ్పత్సమ్పన్నస్సన్నపి జనకాదివ చ్చతుర్థపురుషార్థసమర్థనసమర్థో భవతీత్యాశయః అత్రాదావర్ణగణాదిశుద్ధే రభ్యుచ్ఛ్రయః తదుక్తం ఆదౌ మగణప్రయోగః లక్ష్మీవాచక "మ" వర్ణప్రయోగః "దేవతావాచకాశ్శబ్దా యే చ భద్రాదివాచకాః తే సర్వే నైవ నిన్ద్యాస్స్యు ర్లిపితో గణతోపి వా" ఇతి. అత్ర చతుఃపుమర్థసమర్థనేన కృతినేతుః పురుషార్థచతుష్టయ సంసిద్ధి ర్భవిష్యతీ త్యభిప్రాయః. అస్మి శేవమగ్గా మహేశ్వర ఇవ రామ ఇత్యుపమయో శ్చ కుమారవత్కుమార ఇత్యత్రోపమాయా శ్చాన్యోన్యనైరపేక్ష్యేణ సంసృష్టిః. అర్థాన్తరే పరస్పరసాకాంక్షత్వాత్ అఙ్గాఙ్గీభావాఖ్యస్సఙ్కరః. కుమారవత్కుమార ఇత్యత్రానేకార్థద్యోతకత్వాచ్ఛ్లేషః. వృత్త్యనుప్రాస శ్చ.

## తెనుఁగుఁ డీక.

మహారాజరాజశ్రీ శ్రీరాజా రావు వేంకటమహీపతి సూర్యారావుగారిపేరట సంకితం బగునీకుమారశతకము బాలురకు సుసంబోధం బగునట్లు తెనుఁగుఁడిప్పణి వ్రాయుట కుద్యోగించి నిర్విఘ్నపరిసమాప్తికై యాశీర్వచనరూపమగుమంగళమును జేయుచున్నాఁడను.

కం. వలమురిని బుట్టుఁగైదువు,నలరుచుఁ జేదోయిఁ బట్టి • యరయు జగములం
    దెలివిగలనిదుర సుప్పెడు,కలుములవాల్గంటిమగఁడు • గావుత మనలన్.

తే. పాలమున్నీటిపై తేట • పాపఁడేని, పూలసెజ్జను బవళించి • పాలుపుగాంచు
    మగనిపేరెద నిలిచిన • మగలమగువ, చూపుగమి మిమ్ముఁ బ్రోవుత • సూర్యరాయ

ఆ. వె. తల్లితల్లి మీకుఁ • దగినంతధన మిచ్చు, మామమామ మీకు • మహి నొసంగుఁ
గూఁతుకూఁతుమగని•భాతి మీకుఁ గాక, మఱి వెలయఁ జేయుఁ•గాక కుమార !

౯. బిడ్డబిడ్డను దలఁచేర్చి • బిడ్డబిడ్డ, బిడ్డ నొదనిడి ముద్దాడు•పెద్దవేళ్ల
బిడ్డలను బిడ్డబిడ్డల•బిడ్డబిడ్డ, బిడ్డల నొసంగు నీకు సం•త్రియ కుమార!

౧౦. శంకజనివాన సిరి మగ,కాంక్ష నిమఁ జూచి మెచ్చి•యలరుచుఁ జేరఁగ
వేంకటకుమారమహిప,త్యంక శ్రీసూర్యరాయ • యమితాభ్యుదయా!

యస్య=ఎవనియొక్క, మాతా = తల్లి, మంగాంబికా = మంగాయమ్మగారో, యస్య=ఎవనియొక్క, పితా=తండ్రి, రామమహేశ్వరః=రామారాయప్రభువులో, అయం=ఈ, కుమారః = "వేంకటమహీపతిసూర్యరావుగారు" అనుకుమారుఁడు, కుమారవత్ =కుమారస్వామివలె, అరిమండలం=శత్రుసమూహమును, ప్రాక్ =శీఘ్రముగా, జయతు=జయించుఁగాక. ఇచ్చట నంబికామహేశ్వరశబ్దములు పార్వతీపరమేశ్వరార్థకములు గనుక వారిపుత్రుఁ డగుకుమారస్వామి తారకాసురుఁడు మొద లసురాక్షసుల జయించి నట్టుల యితఁడు స్వశత్రువులను జయించుఁగాక మని యాశీర్వాదము; ఇది యొకయర్థము.

మఱియు, అయంకుమారః=ఈకుమారుఁడు, కుమారవత్ =శ్రీనారాయణునివలె, 'కు' అనఁగా భూమి, 'మా' యనఁగా లక్ష్మి వీరలను గ్రహించువాఁడని కుమార శబ్దమునకు వ్యుత్పత్తి, అరిమండలం=శత్రువశమైనభూమండలమును, జయతు=స్వాధీనమును జేసికొనుఁగాక.

రెండియు, అయం=ఈ, కుమారవత్కుమారః = పుత్రికాపుత్రులుగలిగిన కుమారుఁడు, అరి=వాల్గించులఁగల, మండలం =భూమండలమును, జయతు=జయించునుగాక, అనఁగా చతుస్సముద్రముద్రితభూమండలము నేలెడుమనిభావము.

మఱియు, అయంకుమారవత్కుమారః=భార్యలు సంపత్తి కాలలాగలిగిన యీ కుమారుఁడు, అరిమండలం=అంతశ్శత్రువు లగుకామక్రోధాదిసమూహమును, జయతు=జయించుఁగాక; అనఁగా జనకమహారాజాదులవలె సంసారసుఖము లనుధర్మార్థకామముల ననుభవించుచు మోక్షపురుషార్థమును గూడ సాధింపఁగలఁడని భావార్థము. ఈశ్లోకము చతుర్విధపురుషార్థసాధక మగుటవలనను, నాదియందు మగణప్రయోగము గలద గుటవలనను నిర్దుష్టమై మంగళోపేతమగుచు నాయకునకు శుభముల నిచ్చునని తాత్ప

ర్థము. ఈశ్లోకమందు "శత్రోరియోవిజయశ్రియా" యనువ్యాయమున ననుసరించి శత్రుజయరూప మగుమంగళాశీర్వచనము ప్రతిపాదింపఁబడెను: ఉపమాలంకారము శ్లేషాలంకారము వృత్త్యనుప్రాసాలంకారమును.

శ్లో. గఙ్గాధరతనూజ స్త్వం, గఙ్గాధర ఇవాపరః
కుమారాభ్యుద్ధతాఞ్ఛత్రూన్, జయ మిత్రాణి రక్షయ. ౭

కం. సాధింపు కుమారా! గం
గాధరసుతుఁడ వగునీవు • గదిసినదర్పో
ద్ధతుల నరుల నపరగం
గాధరుఁడో యనఁగ మిత్రగణముఁ దనుపుమా. ౭

వ్యా. గఙ్గాధర ఇతి. కుమార ఏవ కుమారః తస్యసమ్బుద్ధిః. శ్లిష్టరూపక మేతత్. కవేః కులవృద్ధత్వా త్కుమారేతి సమ్బోధన మేవ ముత్తరత్రాపి. గఙ్గాధరస్య=గఙ్గాధరరామరాయనామ్నః ఈశ్వరస్య చ, తనూజః=పుత్ర స్త్వం అపరః గఙ్గాధర ఇవ=ఉభయత్రాపి సమాన మేతత్. శ్రు, "ఆత్మా వై పుత్ర నామాసీ" తి శ్రుతేః. అభి=అభిముఖ్యేన, ఉద్ధతాన్=దర్పమాత్సర్యవిశిష్టా నిత్యర్థః; శత్రూన్ జయ=అభిభవ, నతు శత్రుమాత్రంహింస్యా ఇతిభావః, మిత్రాణి=సుహృదః.వి॥ "అథ మిత్రం సఖా సుహృ" దిత్యమరః. రక్షయ=దానమానాది సత్కారేణ ప్రీణయ, "విభావయంత్స వృద్ధీనాం, ఫలంసుహృదనుగ్రహ" మిత్యుక్తత్వాత్. అత్ర రాజకుమారశివకుమారయో స్తజ్జనకయో శ్చ అభేదాధ్యవసాయేన శ్లేషమాలాతిశయోక్తిః. యమకవృత్త్యనుప్రాసయోశ్చ సంసృష్టిః.

టీ. కుమార=ఓరాజకుమార! గంగాధరతనూజః=రాజకుమారపక్షమున, గంగాధరరామరాయగారి కుమారుఁడవనియుఁ, కుమారస్వామిపక్షమున నీశ్వరపుత్రుఁడవనియు, త్వం=నీవు, అపరః=రెండవ, గంగాధర ఇవ = గంగాధరరాజువలెను నీశ్వరునివలెను; తానేపుత్రుఁడై పరిణమించు నని శ్రుతి. అభ్యుద్ధతాన్ = ఎదిరించియుద్ధతులైనట్టి, శత్రూన్=వైరులను, జయ=గెలువుమా; అనఁగా నెదిరించుశత్రువులను జయింపు మని యు నహంకారులగుశత్రువుల నుపేక్షింపుమనియు నభిప్రాయము. మిత్రాణి=మిత్రులను, రక్షయ=సంతోషపెట్టుమా; నిగ్రహానుగ్రహసామర్థ్యయుతులగురాజు శత్రుల శిక్షించి

మిత్రుల రక్షింపవలయు ననియు నట్లుచేయక యుపేక్షించినయారాజును నపుంసకుని స్త్రీలువలెఁ బ్రజలు నిరాదరించెద రనురాజనీతి ననుసరించి రాజులకు నిగ్రహానుగ్రహములు ముఖ్యధర్మము లని యాశ్లోకముచే సూచియింపఁబడెను. ఈశ్లోకంబున శ్లేషమూలాతిశయోక్తియమకవృత్త్యనుప్రాసములకు సంసృష్టి.

శ్లో. మన్దేహా ఇవ మన్దేహాః, భవన్తు రిపవ స్తవ
కుమార! సూర్య తేజోభి,హతాః ప్రాగ్బ్రహ్మవాగ్జితాః. 3

కం. ముం దగ్రజవాగభిభూ
తిం దగిలి కుమార! సూర్య, తేజోహతులై
మందేహులచందంబున
మందేహు లగుదురు గాక, మహి నీమరిపుల్.

వ్యా. మందేహా ఇతి. హేకుమార! సూర్యస్య=సూర్యనామ్నః స్తవతేజసా, అభిహతాః=పరిక్షతాః, ప్రాక్=పూర్వమేవ, బ్రహ్మవాగ్భిః=విప్రవాక్యైః, జితాః=అభిభూతాః, సర్వేబ్రాహ్మణాః అస్య నిష్కారణద్రోహిణో నశ్యం త్వితి శేపు రితి భావః; తవ రిపవః=శత్రవః, సూర్యస్య తేజసాభిహతాః, ప్రాక్=ఉదయాత్పూర్వం,బ్రహ్మవాగ్భిః=బ్రాహ్మణోచ్చరితగాయత్రీమ న్త్రైర్జితాః. మన్దేహాః=మన్దేహానామ కాఽసురా ఇవ మన్దా=మన్దీభూతా, ఈహాః=ఇచ్ఛా యేషాం తథోక్తాః భవన్తు; మన్దేహవృత్తాన్తస్తు శ్రీమద్రామాయణే శ్లో. ॥తత్ర శైలనిభా ఘోరా మన్దేహానామ రాక్షసాః। శైలశృఙ్గేషు లమ్బన్తే సూర్యస్యోదయనం ప్రతి॥ నిహతా బ్రహ్మతేజోభి రహన్యహని రాక్షసాః। అభితప్తాశ్చ సూర్యేణ లమ్బన్తేస్మ పునః పున" రితి అత్ర మన్దేహసాదృశ్యా చ్ఛత్రూణా మసూయామాత్రప్రకటన మేవ సూచితం, నతు బహిరుద్ధతిః జయసిద్ధి శ్చ. పూర్ణోపమా వృత్త్యనుప్రాసయో స్సంసృష్టిః

టీ. కుమార=ఓరాజకుమార! సూర్య=సూర్యనామముగలవానియొక్క, తేజః=తేజస్సుచేత, అభిహతాః=తిరస్కరింపఁబడినట్టియు, ప్రాక్=పూర్వమందు, బ్రహ్మవాగ్జితాః=బ్రాహ్మణవాక్యములచే జయింపఁబడిన, తవ=నీయొక్క, రిపవః=శత్రువులు, అనఁగాఁదపశ్శాలు లగుబ్రాహ్మణులు నీశత్రులను శపియించుచున్నా రని భావము; సూర్య=సూర్యునియొక్క, తేజః=తేజస్సుచేత, అభిహతాః=తిరస్కరింపఁబడునట్టిరాక్ష

ప్రాక్=ఉదయమునకుఁ బూర్వమందు, బ్రహ్మవాక్=బ్రాహ్మణులచేనుచ్చరింపఁబడు గాయత్రీమంత్రములచే, జితాః=జయింపఁబడిన, మందేహాః ఇవ=మందేహులనురాక్షసుల వలె, మందేహాః=మంద మైనయిచ్ఛ గలవారు, భవంతు=అవుదురు గాక. ఇచ్చట శత్రువులకు మందేహులతోఁ బోల్చుటవలన వసవాచమాత్రమే ప్రకటనచేయఁబడెను గాని బాహాటముగా వెలుపలికి వచ్చుటయు జయసిద్ధియు లే దని సూచించుచున్నది. పూర్ణోపమాలంకారము వృత్త్యనుప్రాసాలంకారమును.

శ్లో. కుమారీవ కుమారం తం, దేవసేనాపరిష్కృతా
రాజ్యలక్ష్మీః కుమార! త్వాం,సనజ్జా భజతు స్వయమ్. ౪

తే. అల కుమారుఁ గుమారిక వలెను దేవ
సేన సై సేఁతఁ దనరి భజించుఁగాత
సానుషంగంబుగా నిన్నుఁ దాను శ్రీకు
మారసూర్యాధినాథ సామ్రాజ్యరమయు. ౪

వ్యా. కుమార! రాజ్యలక్ష్మీః కర్త్రీ) త్వాం, తం=ప్రసిద్ధం, కుమారం=స్కన్దం, పరిష్కృతా=చతుర్విధభూషణాలఙ్కృతా, కుమారీ=కన్యకా, దేవసేనా=ఇన్ద్రపుత్రీవ సనజ్జా=సక్తాసతీ, స్వయం=అయత్నసిద్ధం యథాతథా, భజతు, 'భజ సేవాయామ్" యథా కుమారస్వామినం దేవసేనా సానుషంగా స్వయం వవ్రే తథైవ రాజ్యలక్ష్మీ స్త్వామపి వృణుయా దిత్యాశయః

అన్యచ్చ, హే కుమార! దేవ=స్వామిన్. ని: "దేవస్స్వామీతి నృపతి ర్భృత్యై ర్భర్తేతి చాధమై" రిత్యమరః" పరిష్కృతా=రథగజహయభటభూషితా సేనా, పరిష్కృతా = ధనధాన్యాదిసమృద్ధలఙ్కృతా రాజ్యలక్ష్మీ శ్చ, పరిష్కృతా=కచధార్య దేహధార్యపరిధానవిలేపనరూపచతుర్విధభూషణభూషితా కుమారీవ, త్వాం సనజ్జా= సుజానురక్తా, తం=పూర్వోక్తగుణప్రసిద్ధం, కుమారం=రాజకుమారం, శోభనః=అయ ముభావనావిధి ర్వ్యస్తిస్వర్తని భవతి తథా, భజతు=ఆశ్రయతు. అత్ర సేనా రాజ్యలక్ష్మ్యౌ కుమారీవ, రాజ్యలక్ష్మీ కుమార్యౌ సేనేవ చ, సేనాకుమార్యౌ రాజ్యలక్ష్మీరివ చ, త్వాం భజన్త్వితి. ఉపమాలఙ్కారః సముచ్చయః వృత్త్యనుప్రాసశ్చ. అత్ర త్రిస్త్రీణాం సేనా రాజ్యలక్ష్మీ కుమారీణాం యాగపద్యభజనేన అస్య కుమారస్య మహాభాగ్యశాలిత్వం సూచ్యతే.

టీ. కుమార=ఓ రాజకుమారక! రాజ్యలక్ష్మీః=రాజ్యలక్ష్మి, త్వాం = నిన్ను, పరిష్కృతా=నాల్గువిధము లగుభూషణములచే నలంకరింపఁబడిన, కుమారీ=కన్యక యగు, దేవసేనా = ఇంద్రపుత్త్రి యగు దేవసేన, తం=ప్రసిద్ధుఁడైన, కుమారమివ=కుమారస్వామిని వలె, సనంగా = అనక్తితోఁగూడినదై, స్వయం=తాను. భజతు=సేవించుఁగాక.

రెండవయర్థము. హేకుమార=ఓ రాజకుమార! హేదేవ=ఓ ప్రభూ, పరిష్కృతా=రథగజహయభటులచే నలంకరింపఁబడిన, సేనా=సేనయు, పరిష్కృతా = ధనధాన్యాది సంపదలంకృత యగు, రాజ్యలక్ష్మీః=రాజ్యలక్ష్మియు, పరిష్కృతా = కచభాగ్య దేహధార్య పరిధానవిలేపనరూపము లగునాల్గువిధములభూషణములచే భూషితురాలగు, కుమారీవ=కన్యకవలె, సనంగా=గుణానురక్తురాలై, తం=పూర్వోక్తగుణములచేఁబ్రసిద్ధుఁడవగు, కుమారం=రాజకుమారుఁడవైన, త్వాం = నిన్ను, స్వయం = శోభనమగుశుభావహవిధి యౌనట్లు, భజతు=ఆశ్రయించుఁగాక. ఈశ్లోకమందు సేనారాజ్యలక్ష్ములు కన్యకవలెను, కుమారీరాజ్యలక్ష్ములు సేనవలెను, సేనాకుమారికలు రాజ్యలక్ష్మివలెను, నిన్ను సేవించుదురుగాక యని యుపమాలంకారము. ఈ శ్లోకమందు సేనారాజ్యలక్ష్మీకుమారికలు ముగ్గురు నొక్కమాఱు సేవించుటచే నీరాజకుమారునకు మహాభాగ్యశాలిత్వము సూచించుచున్నది.

శ్లో. త్రిలిఙ్గరూపో భగవాం,స్త్వాం త్రిలిఙ్గమహేశ్వరమ్
ససర్వమఙ్గళః పాయా, త్కుమార స్వకుమారవత్.

తే. సర్వమంగళాన్వితుఁ డగు • శంకరుండు
దనకుమారుని కైవడి • నినుఁ గుమార!
శ్రీత్రిలింగమహేశ్వరు • నా త్రిలింగ
రూపుఁ డగుభగవంతుండు • ప్రోచుఁగాత.

వ్యా. త్రిలిఙ్గేతి॥ హేకుమార! త్రిలిఙ్గరూపః = త్రయాణాం లిఙ్గానాం శ్రీశైలదక్షవాటీ శ్రీకాళహస్తిస్థితానాం మల్లికార్జున భీమేశ్వర శ్రీకాళహస్తీశ్వరాణాం సమాహారః తద్రూపం యస్య సభగవాన్ షడ్గుణైశ్వర్య సమ్పన్నః శివః, త్రీణి లిఙ్గాని యస్మిన్ స దేశః తస్య మహేశ్వరః=రాజా, తం త్వాం, సర్వమఙ్గళయా=పార్వత్యా సహితస్సన్ స్వసమృద్ధినం కుమారవత్ యద్వా స్కన్దమివ, పాయాత్=

అవతు. అస్య దేశస్య త్రిలిఙ్గ ఇతి త్రినగ ఇతి అన్ధ్ర ఇతి చ వ్యవహారః. త్రిలిఙ్గ రూపభగవత స్త్రిలిఙ్గదేశవాసిత్వాత్ తత్సాన్నిధ్యతత్కారుణ్యపాత్రస్యాస్యత్రిలిఙ్గ దేశాధిపతిత్వం కృత్వా అవ త్వితి తాత్పర్యార్థః.

కించ కుమార ! త్రీణి=స్త్రీపున్నపుంసకసంజ్ఞాని, లిఙ్గాని=చిహ్నాని రూపాణి యస్య స భగవాన్ విష్ణు స్త్రిలిఙ్గమహేశ్వరం త్వాం సర్వాణి తాని మఙ్గళాని తై స్సహితస్సన్ స్వకుమారవత్=బ్రహ్మాదీనివ, పాయాత్=రక్షేత్. అత్ర శ్లేషాలఙ్కార వృత్త్యను ప్రాసయో శ్చసంసృష్టిః

టీ. హేకుమార=ఓరాజకుమారక ! త్రిలింగ రూపః = శ్రీశైలదక్షవాటీ శ్రీకాళ హస్తులయందుండు మల్లికార్జున భీమేశ్వర శ్రీకాళహస్తీశ రూపుఁడగు, భగవాన్=షడ్గుణై శ్వర్యవంతుఁ డగునీశ్వరుఁడు, త్రిలింగ=త్రిలింగదేశమునకు, మహేశ్వరం=రాజైన; త్వాం=నిన్ను, ససర్వమంగళః=పార్వతీదేవితోఁగూడినవాఁడై, స్వకుమారవత్=తన కుమారునివలె, లేక కుమారస్వామినివలె, పాయాత్=రక్షించుఁగాక. ఈదేశమునకుఁ త్రిలింగ దేశమనియుఁ త్రినగదేశమనియు నంధ్రదేశమనియు వ్యవహారము. త్రిలింగ రూపుఁడగు భగవంతుఁడు త్రిలింగదేశవాసి యగుటచేఁ దద్దేశస్థితుఁడుఁ, దత్కా రుణ్య పాత్రుఁడునగు నీరాజకుమారునిఁ త్రిలింగదేశాధిపతిఁగాఁ జేసి రక్షించుఁగాక యని తాత్పర్యము.

మఱియుఁ కుమార-ఓరాజకుమార ! త్రిలింగరూపః-స్త్రీపున్నపుంసకరూపుఁ డగు, భగవాన్=విష్ణువు, త్రిలింగమహేశ్వరం-త్రిలింగదేశాధీశ్వరుఁడవగు, త్వాం= నిన్ను, ససర్వమంగళః = సర్వమంగళములతోఁగూడినవాఁడై, స్వకుమారవత్=తన కుమారులగు బ్రహ్మాదులవలె, పాయాత్=రక్షించుఁగాక. శ్లేషాలంకారమును వృత్త్యను ప్రాసాలంకారమును.

శ్లో. వాణీం వాణీ శ్రియం శ్రీశ్చ, మఙ్గళం సర్వమఙ్గళా
ఆయు ర్వీర్యం జయం యచ్ఛం, త్వాసాం నాథాః కుమార! తే. ౬

తే. వాక్కులను వాణి సంపద • ల్పద్మనిలయ
మంగళము సర్వమును • సర్వమంగళయును
నొసఁగుదురు గాక నీకు నాఁయువును వీర్య
మును జయంబును దద్వల్లభులు కుమార !

వ్యా॥ వాణీ ఖలు॥ హేకుమార! తే=తుభ్యం, వాణీ=వాగ్దేవతా, వాణీం=పరాపశ్యన్తీమధ్యమావైఖరీరూపాం చతుర్విధాం ఉక్తంచ, "పరాప్రాణేషు సంజాతా, పశ్యన్తీ భుజగేషు చ. మధ్యమా పశుష్వేవ, వైఖరీ వర్ణరూపిణీ" ఇతి, యచ్ఛతు=వాగ్దేవతా త్వాం సకలభాషావిశేషవిశారదం కరోత్వితి భావః; శ్రీః=లక్ష్మీః, శ్రియం=త్రివర్గసమ్పదం చ గజతురగాన్దోళికాది మహైశ్వర్యశాలినం కరోత్వితి భావః; సర్వమఙ్గళా=అమ్బికా, మఙ్గళం=సర్వశుభావహం శ్రేయశ్చ వివాహపట్టాభిషేక పుత్రపౌత్రికావాప్తినిత్యోత్సవాదిరూపాం కల్యాణపరమ్పరాం వితరత్వితి భావః. ఆసాం=నాథాః=బ్రహ్మవిష్ణుమహేశ్వరాః క్రమాత్ ఆయుః=శతాబ్దాదధిక ముత్తమాయుష్యం చ, ఉక్తంచ, "ఉత్తమం చ శతాదూర్ధ్వ" మితి. ఆయుషః ప్రదానే బ్రహ్మణ ఏవ ప్రసిద్ధత్వాత్ స్వస్త్రతారోగ్యదృఢశరీరతో ప్వలక్షితం పూర్ణాయుశ్చ యోగ్యో భవత్వితి భావః. వీర్యమ్=అసదృశపరాక్రమం చ "విష్ణునా సదృశో వీర్యే" ఇత్యుక్తత్వాద్ దుష్టనిగ్రహరూపవిక్రమం నారాయణో దధ్యాదితి భావః, జయం=విక్రమస్య ఫలరూపం సర్వోద్యమసిద్ధించ ఈశ్వరస్య త్రిపురాసురాదిసకలదుర్జనజేతృత్వా దితో ఽఖణ్డభూమణ్డలరాజ్యలాభరూపామిష్టావాప్తిం దిశత్విత్యాశయః, యచ్ఛన్తు=ప్రతిపాదయన్తు. అత్ర రీతిర్నామగుణః తల్లక్షణం తు. "యథోపక్రమనిర్వాహో, రీతి రిత్యభిధీయతే," యథాసఙ్ఖ్యాలఙ్కారయోగాత్ప్రకృష్టప్రాసానాం సంసృష్టిః.

టీ॥ కుమార=ఓరాజకుమారక! తే=నీకొఱకు, వాణీ=వాగ్దేవత, వాణీం=పరాపశ్యంతీమధ్యమావైఖరు లను నాల్గుభేదములు గలవాక్కును. ప్రాణులవలనఁబుట్టుభాష పర యనియు, సర్పములవలనఁగల్గుభాష పశ్యంతి యనియుఁ, బశువులవలననైనభాష మధ్యమయనియు, నక్షరరూప మగుభాష వైఖరి యనియుఁ జెలియఁదగినది. యచ్ఛతు=ఇచ్చుఁగాక, అనఁగా వాగ్దేవత నిన్ను సకలభాషావిశారదునిఁగాఁ జేయుఁగాక యని భావము. శ్రీః=లక్ష్మీదేవి, శ్రియం=త్రివర్గరూపమగుసంపద యనఁగా గజము తురగము ఆందోళికమొదలగు నైశ్వర్యములు గలవానిఁగా చేయునని తాత్పర్యము. సర్వమంగళా=పార్వతీదేవి. మంగళం=సమస్తశుభరూప మైనశ్రేయస్సును, అనఁగా వివాహము పట్టాభిషేకము సంతానము మొద లగునుత్సవరూప మైనకళ్యాణపరంపరల నిచ్చునని యూహనీయము. ఆసాం=ఈసరస్వతీలక్ష్మీపార్వతులయొక్క, నాథాః=భర్తలగుబ్రహ్మవిష్ణుమహేశ్వరులు, క్రమాత్=క్రమముగా, ఆయుః=నూఱుసంవత్సరములకధిక మగునాయుర్దాయమును; అనఁగా నూఱుసంవత్సరములకుమించిన యాయుర్దా

యు ముక్తము మని శాస్త్రసిద్ధము. అయుస్సు నిచ్చుప్రసిద్ధి బ్రహ్మకుఁగలదుగావున చెప్పఁడు వారోగ్యము శరీరదార్ఢ్యమునతోఁగూడినపూర్ణాయుర్దాయ మగుఁగాక యని భావము. వీర్యం=అసదృశ మైనపరాక్రమము, "విష్ణునా సదృశో వీర్యే" యని దుష్టనిగ్రహరూప మైనపరాక్రమమును శ్రీహరి యొసఁగు నని భావము. జయం=విక్ర మానుకూలం బగుకార్యసిద్ధి నసఁగా నీశ్వరుఁడు త్రిపురాసురులమొద లగుదుష్టుల జయించువాఁడగుటచే నధికభూమండలరాజ్యలాభరూపమైన యిష్టసిద్ధి నొసఁగునని తాత్పర్యము. యచ్ఛంతు=ఇచ్చెదరుగాక. ఇచ్చుట రీతి యనుగుణము. యథాసంఖ్యతుల్య యోగితావృత్త్యనుప్రాసములకు సంసృష్టి.

శ్లో. పాయా దమ్భోధిజామాతా, దయాదక్షిణచేతసా
తత్రైవాహార్యజామాతా, కుమార! త్వాం చిరాయుషమ్. ౭

కం. కులభూధరజామాతయు
జలనిధిజామాత సుప్రసన్నదయాని
స్తులవృత్తిఁ బ్రోచెదరుని
న్నలరుకుమారునిఁ జిరాయురన్వితుఁగాఁగన్.

వ్యా. పాయాదితి॥ హేకుమార! మాతా=లోకజననీ, అమ్భోధిజా=క్షీరాబ్ధితన యా రమా చ, అమ్భోధేర్జామాతా-దుహితృపతి ర్విష్ణు శ్చ, తత్రైవ=తత్ప్రకారేణైవ, అహార్యజా మాతామ్బికా, అహార్యా త్పర్వతా జ్జాతా పార్వతీత్యర్థః. వి॥ "అహార్య ధర పర్వతా" ఇత్యమరః॥ అహార్యస్య=హిమవతః జామాతా ఈశ్వర శ్చ, దయయా=ప్రే మ్ణా, దక్షిణం=సరళం చ తచ్చేతః తేన త్వాం చిరాయుషం=దీర్ఘాయుష్మన్తం, పాయా త్=అవతు, చిరంజీవినం కృత్వా పాయా దితి భావః. శ్లేషోజ్జీవితా తదుజ్జీవితాచేయం తుల్యయోగితా వృత్త్యనుప్రాస శ్చ.

టీ. కుమార=ఓరాజకుమారక! మాతా=లోకజనని యగు, అంభోధిజా=లక్ష్మీ దేవి మఱియు నంభోధిజామాతా, అంభోధి=సముద్రునకు, జామాతా=అల్లుఁడగు విష్ణువు, తత్రైవ=ఆప్రకారమే, మాతా=తల్లియైన, అహార్యజా=పర్వతపుత్రి యగుగౌరీదేవియు, అహార్య=పర్వతమునకు, జామాతా=అల్లుఁడగు నీశ్వరుఁడును, దయా=దయచేతను,

దక్షిణ=సరళమైన, చేతసా=మనముచేతను, త్వాం=నిన్ను. చిరాయుషం=దీర్ఘాయుష్మంతు
నిఁగా, పాయాత్=రక్షించుఁగాక, అనఁగా చిరంజీవిఁగా నొనర్చి పాలించుఁగాకయని
భావము. శ్లేషోజ్జీవితతదనుజ్జీవిత తుల్యయోగితాలంకారము వృత్త్యను ప్రాసమును.

శ్లో. భాషాయోషాఽధరాస్వాదనోత్సవక్రమవర్తనమ్
ధాతురాస్యచతుష్కం తే, కుమారావ్యాద్వయః క్రమమ్.

గీ. భారతీయోషితాధరాస్వాదనోత్స
వక్రమావర్తనం బైననలువమోముచ
తుష్టయము ప్రోచుఁగాతఁ జతుర్విధమగు
తావకం బైనప్రాయంపుదశ కుమార! ౮

వ్యా. భాషేతి ॥ హేకుమార! భాషేతియోషా=సరస్వతీ, తస్యాః అధరః=
అధరోష్ఠః, తస్యాస్వాదనమేవోత్సవ స్తస్మిన్ క్రమేణ=పర్యాయేణ, వర్తనం=ప్రసరణం
యస్య తత్ ధాతుః = బ్రహ్మణః, ఆస్యానాం = ముఖానాం, చతుష్కం = చతుష్టయం
తే=తవ, వయసాం=బాల్యయౌవనకౌమారవార్ధకానాం, క్రమం = పర్యాయేణ, దశా
భేదం అవ్యాత్ ॥ అవ రక్షణే. అత్ర బ్రహ్మణః ప్రియాఽధరాస్వాదనమహోత్సవానుభవ
సమయవర్తిత్వా దానన్దాతిశయేన స్వనిష్ఠాయుర్దానసామర్థ్యప్రకటనం చ, దమ్ప
త్యో రానన్దగోష్ఠీసమయే శిశువిషయకప్రేమాతిశయోఽపి భవతీతి చ ధ్వన్యతే. పరిక
రాఙ్కురాలఙ్కారః "సాభిప్రాయే విశేష్యేతు భవేత్పరికరాఙ్కురః" ఇతిలక్షణాత్.

టీ. కుమార = ఓరాజకుమార! భాషాయోషా, సరస్వతీదేవియొక్క, అధర=
అధరోష్ఠముయొక్క, ఆస్వాదన=అనుభవమను, ఉత్సవ=ఉత్సవమందు, క్రమ=క్రమము
చేత, వర్తనం=ప్రసారము కలిగినటువంటి, ధాతుః=బ్రహ్మదేవునియొక్క, ఆస్యచతు
ష్కం = ముఖచతుష్టయము, అనఁగా నాల్గుముఖములు, తే = నీయొక్క, వయఃక్రమం,
వయః = బాల్యయౌవనకౌమారవార్ధకావస్థలయొక్క, క్రమం = అవస్థాభేదమును,
అవ్యాత్=రక్షించుఁగాక. ఈశ్లోకమందు బ్రహ్మదేవునకుఁదానుప్రియాధరానుభవోత్సవ
మందుండుటవలన నానందాతిశయముచే దనయాయుర్దానసామర్థ్యప్రకటనమును
దంపతుల యానందసమయమున శిశువులయందుండు నత్యంతప్రేమాతిశయమును గల్గు
చున్నదని భావము. పరికరాంకురాలంకారము.

శ్లో. శ్రీభూకుచయుగస్పర్శ, స్విన్నహస్త శ్చతుర్భుజః
సవ్యఞ్జక ముపాయాం స్తే, కుమారోపదిశే త్స్వయమ్.

తే. కలుపుఁగావుత శ్రీరమా ♦ క్ష్మాకుచద్వ
యద్వయస్పర్శనస్విన్న ♦ హస్తుఁ డగుచు
నొలుపు నెలుపు చతుర్భుజుం ♦ డోకుమార!
సాభినయముగఁ దా నీ కుఁ ♦ పాయములను. ౯

వ్యా. శ్రీతి ॥ హేకుమార! శ్రీః=లక్ష్మీః, భూః=భూమిః, తయోః కుచయుగం తస్యస్పర్శః తేనస్విన్నాః=సాత్త్వికోదయేన స్వేదయుక్తాః హస్తాః యస్య సః, చతుర్భుజః=నారాయణః, స్వయం, ఉపాయాన్ = సామాదీన్, తే=తుభ్యం, సవ్యఞ్జకం=సాభినయం యథాతథా, ఉపదిశేత్=ఉపదేశం కుర్యాత్. అత్ర గురో రుపదేశకాలే సుఖబోధాయ హస్తవిక్షేపప్రసిద్ధిద్వారా సవ్యఞ్జక మిత్యుక్తం. స్వయముపదిశే దిత్యనేన "ప్రపేదిరే ప్రాంక్తనజన్మవిద్యా" ఇతివత్ సాక్షాదనుగ్రహాదేవ కుమారస్యాస్య సామాద్యుపాయజ్ఞానం సహజతయా సిధ్యతీతిభావః. గురవస్తు నిమిత్తమాత్రాభవన్తీతి ఫలితార్థః. అత్రాపి పరికరాఙ్కురాలఙ్కారః.

టీ. కుమార = ఓరాజకుమారా! శ్రీః=లక్ష్మీదేవియొక్కయు, భూ=భూదేవియొక్కయు, కుచయుగ-కుచద్వంద్వముయొక్క, స్పర్శ-తాఁకుటచే, స్విన్న=సాత్త్వికభావమువలనఁ బుట్టిన చెమటతోఁగూడిన, హస్తః=హస్తములుకలిగినట్టి, చతుర్భుజః=నారాయణమూర్తి, స్వయం = స్వయముగా, ఉపాయాన్ = సామాద్యుపాయములను, తే=నీకొఱకు, సవ్యంజకం=సాభినయముతోఁగూడినట్టు, ఉపదిశేత్=ఉపదేశము చేయుఁగాక. ఈశ్లోకంబున గురు వుపదేశసమయంబున బాలురకు సుబోధనిమిత్తము హస్తవిక్షేపముఁజేయుట ప్రసిద్ధముగాన సవ్యంజక మనుపదము వచియింపఁబడెను. "స్వయముపదిశేత్" అనిచెప్పుటచే "ప్రపేదిరే ప్రాంక్తనజన్మవిద్యా" యనురీతిని భగవదనుగ్రహమువలననే యీరాజకుమారునకు సామాదులయొక్కజ్ఞానము స్వతస్సిద్ధముగా సిద్ధించునని భావము. పరికరాంకురాలంకారము.

శ్లో యదఙ్గ మరుణం సోమం, నీలాంచద్విద్రుమప్రభమ్
సదేవ స్త్వాం కుమారావ్యా, ద్యోజయిత్వా నృపశ్రియా. ౧౦

తే. అరుణ మైనట్టియెవనిదేహంబు సోమ
మగుట నీలాంచితప్రవాళాభమయ్యె
నట్టి దేవుండు నిన్ను రాజ్యరమతోడఁ
బొందుపఱచి ప్రోచుఁగావుతఁ గుమార!        ౧౦

వ్యా. యదఙ్గమితి. హేకుమార ! అరుణం=లోహితం యస్య, అఙ్గమ్=శరీరంఉమ యా సహితం సత్ నీలేన=ఇంద్రమణినా, అఞ్చతః=విద్రుమస్య ప్రభేవప్రభా యస్యతత్ భాతీతి శేషః, అర్ధాఙ్గ రూపయోరుమయానీల మితరల్లోహితం. అతఏవ ఇన్ద్రనీల సమేత ప్రవాళరూపముపమాన ముక్తం, తథాచోక్తం "ఇన్ద్రనీలమణిమేచకమర్ధం, ప్రక్రియాం వహతి విద్రుమరాశేః । తావకం వపు రుమాసఖ యాభ్యాం, మాతృమస్తి పితృమ న్తి జగన్తీ"తి. సదేవః=నీలలోహితః శి. "ధూర్జటి ర్నీలలోహిత" ఇత్యమరః. త్వాం= నృపస్యశ్రీః=లక్ష్మీః తయాః=రాజ్యలక్ష్మ్యాసహ, యోజయిత్వా=మేళయిత్వా, అవ్యాత్= రక్ష్యాత్. అనేన పార్వతీపరమేశ్వరయో రివ రాజ్యలక్ష్మీకుమారయో రవిశ్లేషసమ్బన్ధో ధ్వన్యతే. అత్రనీలాంచ ద్విద్రుమస్య ప్రభేవప్రభా యస్యేతినిదర్శనాసాచ సోమ మితి పదార్థహేతుకకావ్యలిఙ్గేనానుగృహ్యత ఇతి తయో రఙ్గాఙ్గిభావేన సఙ్కరః.

టీ. కుమార=ఓరాజకుమారక ! అరుణం=ఎఱ్ఱనైనటువంటి, యదంగం=ఏయీశ్వరునియొక్క శరీరము, సోమం=పార్వతితోఁగూడినదై, నీలాంచద్విద్రుమప్రభం, నీల= ఇంద్రనీలమాణిక్యముతో, అంచత్=ఒప్పుచున్నట్టి, విద్రుమ=పవడముయొక్క, ప్రభం=కాంతివంటికాంతి గలదై, ప్రకాశించునో యని విశేషపదము. ఈశ్వరునియొక్క సగముశరీరము పార్వతితోఁ గూడినది గనుక సగముశరీరము నలుపును సగమెఱుపును గల దగుటచే నింద్రనీలముతోఁ గూడినపవడముతో సామ్యము. ఈశ్వరుఁడు రక్తవర్ణుఁ డని కవిసమయసిద్ధము. సః దేవః=ఆదేవుఁడు, త్వాం=నిన్ను, నృపశ్రియా=రాజ్యలక్ష్మి తో, యోజయిత్వా=కూర్చి, అవ్యాత్=రక్షించుఁగాక. పార్వతీపరమేశ్వరులకువలె నీరాజకుమారరాజ్యలక్ష్ములకు నెడతెగనిసంబంధముకల్గునని తోఁచుచున్నది. కావ్య లింగాలంకారముచే ననుగ్రహింపఁబడునిదర్శనాలంకారము. ఈ రెంటికి నంగాంగీ భావముచే సంకరము.

శ్లో. యద్వక్త్రం పద్మవ ద్భాతి, పరాగవ్యాప్తపద్మవత్
గణేశ స్తే కుమారాస్తు, నిర్విఘ్నాద్యామసిద్ధికృత్

తే. పద్మకవ్యాప్త మైనయేవ్వాని మోము
పరఁగును బరాగపర్యాప్తపద్మ మనఁగ
నట్టి గణనాయకుండు నీకగుఁ గుమార!
యంతరాయవిహీనకార్యప్రదుండు. ౧౧

వ్యా. యదితి హేకుమార! పద్మవత్=బిన్దుజాలకయుక్తం. ని॥ "పద్మకం బిన్దుజాలక" మిత్యమరః యస్య దేవస్య వక్త్రం .పరాగేణ=రజసా, వ్యాప్తం పద్మమివ. ని॥ "వద్వా తథా య థై వే" త్యమరః, భాతి, సః గణేశః=వినాయకః. తే=తుభ్యం, నిర్విఘ్నం యథా తథా, ఉద్యమస్య=ఉద్యోగస్య, సిద్ధిం=కార్యనిష్పత్తిం, కరోతీతి తత్కృత్ అస్తు స్వయం విఘ్నకరో ప్యారాధిత స్త్వయా ప్రసాదోన్ముఖః సఫలోద్యోగం త్వాం కరోత్వితి భావః, అస్య గణపతిత్వం కర్మవిఘ్నకృత్త్వంచోక్తం. స్మృతౌ॥ "వినాయకః కర్మవిఘ్నసిద్ధ్యర్థం వినియోజితః। గణానామాధిపత్యేచ, రుద్రేణ బ్రహ్మణా తథా॥ తేనోపసృష్టో లభతే, నరాజ్యం రాజనన్దన" ఇతి. అత్ర బిమ్బప్రతిబిమ్బభావేనేయ ముపమావృత్త్యనుప్రాసశ్చ తయో స్సఙ్కరః.

టీ. కుమార=ఓరాజకుమారా! పద్మవత్=బిందుజాలములతోఁగూడిన,ఏనుఁగులకుయౌవనమందుఁజుక్కలవలె నుండునవి పద్మకము లనఁబడును. యద్వక్త్రం=ఏదేవునియొక్కముఖము, పరాగ=పరాగముచేత, వ్యాప్త=వ్యాపించిన,పద్మవత్=పద్మమువలె, భాతి=ప్రకాశించుచున్నదో,సః గణేశః=ఆవినాయకుఁడు, తే=నీకొఱకు,నిర్విఘ్న=విఘ్నములులేనట్టుగా, ఉద్యమ=ఉద్యోగముయొక్క, సిద్ధిం=కార్యసిద్ధిని, కృత్=చేయువాఁడు, అస్తు=ఔఁగాక; గణపతి తాను విఘ్నములుచేయువాఁడైనను నారాధించువారలకార్యములు నిర్విఘ్నముగా సఫలముఁజేయు నని భావము. ఈవినాయకునకు గణాధిపతిత్వము విఘ్నములు చేయుటయు స్మృతియందుఁ జెప్పంబడియెఁ గాన యేరాజకుమారుండైనను నావినాయకు నారాధింపనియెడల రాజ్యముపొందఁడనియు నారాధించురాజు రాజ్యముపొందుననియుఁ దెలియఁదగినది.

శ్లో॥ బహులాస్తనజక్షీర,బిన్దురేఖా సమఞ్చితమ్
కుమ్భా రాననమవ్యం తే, కుమారోపతిశే ష్కణాన్. ౧౨

తే. కృత్తికలగబ్బిపాలిండ్ల•క్షీరబిందు
బృందరేఖాపరిప్లుతి•నందమైన
యలకుమారునియాఁటు మోఁములు గుణములు
నీకు నుపదేశ్య మొనరించు • నోకుమార! ౧౭

వ్యా. బహులేతి॥ హేకుమార! బహులానాం=కృత్తికానాం.॥ని॥ "బహులాః కృత్తికా గావ" ఇత్యమరః, స్తనజానాం=క్షీరాణాం యే బిన్దవః తేషాం రేఖాభిః=పఙ్క్తిభిః, సముఞ్చితం=సమ్యగావ్యాప్తం,కుమారస్య=స్కన్దస్య ఆననషట్కం. ఉక్తంచ శ్రీమద్రామాయణే "క్షీరసమ్భవనార్థాయ, కృత్తికాస్సమయోజయన్। షడ్భిష్షడాననో భూత్వా, జగ్రాహ స్తనజం పయ" ఇతి. తే=తుభ్యం, గుణాన్=సన్ధివిగ్రహయానాసనద్వైధీభావసమాశ్రయరూపాన్ రాజనీత్యుక్తషడ్గుణాన్. తేషాంస్వరూప మత్ర నిరూప్యతే. కిమపయోః కలహేనేతి శత్రుణా సామదానాభ్యాం వ్యవస్థాకరణం. సన్ధిః, అయం బలవచ్ఛత్రువిషయే ఘటతే. విగ్రహోపకారః హీనవిషయ మేతత్. యానం దణ్డయాత్రా ఇదమపి హీనవిషయ మేవ. ఆసనం, అజయ్యశత్రు విషయే సమయనిరీక్షణం. అజయ్యశత్రోః తత్సమ్బన్ధినాం చ ద్విధాకరణం ద్వైధీభావః. బలవత్సమాశ్రయణ మాశ్రయః. ఏవంరూపాన్‌గుణా నుపదిశేత్. అత్ర క్షీరబిన్దురేఖాసముఞ్చితంకుమారానన మిత్యనేన,కుమారస్య శైశవవయోలక్ష్యతే.ఏతాదృగ్వయోవిశిష్టస్సభగవా న్కుమారః "సమానగుణయోస్సఖ్య" మితిన్యాయ మనుసృత్య నవయసస్సవామ్నశ్చ తే ప్రీతిపూర్వక ముపదేష్టా భవ త్విత్యాశయః. స్వభావోక్తి రలఙ్కారః.

టీ. హేకుమార=ఓరాజకుమారా! బహులాః=అర్ఘరైనకృత్తికలయొక్క, స్తనజ=పాలయొక్క,బిందు=చుక్కలయొక్క, రేఖా=పంక్తులచేత, సమంచిత=ఒప్పుచున్న కుమార=కుమారస్వామియొక్క, ఆననషట్కం=ఆఱు మొగములును, తే=నీకొఱకు గుణాన్=సంధివిగ్రహయానాసనద్వైధీభావసమాశ్రయముల నెడిరాజనీతియందుఁజెప్పఁబడినయాఱుగుణములను, ఉపదిశేత్=ఉపదేశమునుజేయుఁగాక, వీనిస్వరూపమెట్లన్నఁ, గలహములేక సామముచేఁగాని దానముచేఁగాని శత్రువులను గలయికచేసికొనుట సంధి. ఇదిబలవంతుఁడగుశత్రువువిషయమైచేయఁదగినది. విగ్రహ మన నపకారము. ఇది బలహీనునియందు వినియోగము. యాన మన దండెత్తుట. ఇదియు బలహీనుని విషయము. ఆసన మన నసాధ్యుఁడగుశత్రువును జయించుటకై సమయమునుజూచుచుం

డుట. ద్వైధీభావ మన బలవంతు లగుశత్రువులకు వారిసంబంధులను వేఱుచేయుట. ఆశ్రయ మన బలవంతునితో స్నేహమును జేయుట. ఈచెప్పఁబడుగుణముల నుపదేశమును జేయుఁగాక యని భావము. పాలచుక్కలతోఁగూడినముఖమని చెప్పుటచేఁ గుమారస్వామికి బాల్యావస్థ దోఁచుచున్నది. అందుచే సమానగుణులకు సమానవయస్కులకు సఖ్య మను న్యాయముచే సమానవయస్సును సమాననామమును గలనీకొఱకు సంతోషముతో నుపదేశముఁజేయుఁగాక యని భావము. స్వభావోక్త్యలంకారము.

శ్లో. త్రయస్త్రింశ త్త్రియశ్చాష్టౌ, దేవా దేవ్య శ్చ సానుగాః
కుమార! తే ప్రసీదన్తు, సరాశ్యృక్షగ్రహా స్తథా.

తే. పరిజనాన్వితు లగుచు ముప్పదియుమువ్వు
రుగురు నెనమండ్రు నైనవేల్పులు ప్రసన్ను
లయ్యెదరు వారి యతివలు నటు సరాశి
తారకాగ్రహములును గుమార! నీకు. ౧౩

వ్యా. త్రయఇతి॥ హేకుమార! ఆదిత్యాః ద్వాదశ అష్టౌ వసవః రుద్రాః ఏకాదశ ద్వావశ్వినౌ సర్వేప్యేతే. త్రయస్త్రింశత్. ఉక్తంచశ్రీమద్రామాయణే. "ఆదిత్యావసవోరుద్రాఅశ్వినౌచపరన్తప" ఇతి, బ్రహ్మవిష్ణ్వీశ్వరా స్త్రియ శ్చ, ఇంద్రాదిదిక్పాలాః అష్టౌచ, ఏతత్సంఖ్యాపరిమాణక దేవాః దేవ్య శ్చ సానుగాః=సానుచరాస్సంతః తథా రాశయః=మేషాదయో ద్వాదశ, ఋక్షాణి=అశ్విన్యాదీని సప్తవింశతి నక్షత్రాణి, తైస్సహితాః సూర్యాదినవగ్రహాశ్చ తే =తుభ్యం, ప్రసీదన్తు = ప్రసన్నాభవన్తు. అత్ర సంక్షేపో నామ గుణః. ఉక్తంచ. "సంక్షిప్తార్థాభిధానం యత్తత్సంక్షేపః ప్రకీర్తితః". వృత్త్యనుప్రాసతుల్యయోగితయో స్సంసృష్టిః.

టీ. కుమార = ఓ రాజకుమారా! త్రయస్త్రింశత్ = ముప్పదిముగ్గురగు, అనఁగా సూర్యులు పన్నిద్దఱు, వసువు లెనమండ్రు, రుద్రులు పదునొకండ్రు, అశ్వను లిరువురును, త్రయః=బ్రహ్మవిష్ణుమహేశ్వరులు ముగ్గురు, అష్టౌ=దిక్పాలు రెనమండ్రు, ఈ సంఖ్యగల, దేవాః=దేవతలు. దేవ్యశ్చ=దేవతలభార్యలును, సానుగాః = పరిచారకులతోఁగూడిన వారై, తథా=అప్రకారము, సరాశ్యృక్షగ్రహాః=మేషాదిపదిరెండురాసులు, అశ్విన్యాదులగునిరువదేడు నక్షత్రములతోఁగూడిన, గ్రహాః=సూర్యుఁడు మొదలగుగ్రహము

లను, తే=నీకొఱకు, ప్రసీదన్తు=అనుగ్రహించెదరుగాక. తుల్యయోగితావృత్త్యనుప్రాస ములకు సంసృష్టి.

శ్లో. యా హవిర్ధాయినీః ప్రాహు, ర్వైర్హుతం సృష్టికారణమ్
కుమార! తే ప్రసన్నాస్స్యు, స్తా స్తే గావో ద్విజాతయః.

కం. ఏవి హవిర్ధాయిను లగు
నేవారలహుతము సృష్టిం హేతువు నగు నా
గోవులు నవ్విప్రులు నీ
కై వర్తింతురు ప్రసన్నులగుచుఁ గుమారా! ౧౪

వ్యా. యా హవిరితి. హే కుమార! యాః గాః హవిరాజ్యాదికం దదతీతి హవిర్ధాయినీః తాః ప్రాహుః యైః విప్రైః హుతం సృష్టేః=జగదుద్భవస్య, కారణం=వృష్ట్యాది ద్వారేణేత్యర్థః. ఉక్తం చ. "అహుత్యాప్యాయతే సూర్య, స్సూర్యా ద్వృష్టి స్తతో౽షధిః, తదన్నం రసరూపేణే"త్యాది, "ఆదిత్యా జ్జాయతే వృష్టిః వృష్టే రన్నం ప్రజా" ఇతి చ. తాదృశ్యః గావః తాదృశః ద్విజాతయ శ్చ, తే=తుభ్యం, ప్రసన్నాస్స్యుః, గోబ్రాహ్మణప్రసాదసిద్ధి స్తే భవత్విత్యభిప్రాయః. యథాసఙ్ఖ్యాలఙ్కారః. "యథాసఙ్ఖ్యం క్రమేణైవ క్రమికాణాం సమన్వయ" ఇతి.

టీ. కుమార=ఓరాజకుమారక! యాః గాః=ఏగోవులను, హవిర్ధాయినీః=ఆజ్యాదిహవిస్సులను నిచ్చువానిఁగాను, యైః విప్రైః=ఏవిప్రులచేత, హుతం=హోమము చేయఁబడినది, సృష్టికారణం=జగదుత్పత్తికిఁ గారణమైనదానినిగా, ప్రాహుః=చెప్పుచున్నారో, తాః గావః=ఆగోవులును, తే ద్విజాతయః=ఆబ్రాహ్మణులును, తే=నీకొఱకు, ప్రసన్నాః=అనుగ్రహముగలవారు, స్యుః=కాఁగలరు. అనఁగా గోబ్రాహ్మణానుగ్రహము నీకు సిద్ధించు నని యాశీర్వాదము. యథాసంఖ్యాలంకారము.

శ్లో. యే లోకే సాధవ స్సాధ్వ్యో, యాశ్చ యే పితృదైవతాః
యే స్వధర్మరతా స్సర్వే, త్వా మవన్తు కుమార! తే. ౧౫

కం. ఏవారలు భువి సాధువు
లేవనితలు సాధ్వులో పితృప్రియు లెవరో

యేవారు స్వధర్మస్పృహు
లో వారలు నిన్నుఁ బ్రోచుఁచుంద్రు కుమారా! ౧౫

వ్యా. య ఇతి. హేకుమార! లోకే యే సాధవః "సాధో భోమర వా తీవే" త్యుక్తలక్ష ణోభయలోకసమ్మతా స్సజ్జనాః, యాస్సాధ్వ్యః "అపి మాం పావయే త్సాధ్వీ స్నా త్వే తీచ్ఛతి జాహ్నవీ" త్యుక్తత్వా దత్యన్తపుణ్యాతమాః పతి వ్రతా శ్చ, యే పితృదైవతాః="నమాతుః పరదైవత" మిత్యుక్తత్వాన్మాతా పితృభక్తా శ్చ, యే స్వధర్మనిరతాః=స్వకులాచారవన్తః. ఉక్తంచ "శ్రేయాన్ స్స్వధర్మో విగుణః పరధర్మో భయావహ" ఇతి, సర్వే పూర్వోక్తాః స్వకృతసుకృతై రితి శేషః, త్వాం అవన్తు, అత్ర మాధుర్యంనామ గుణః. "యాపృథక్పదతావాక్యే తన్మాధు ర్యం ప్రకీర్తిత" మితి. తుల్యయోగితాలఙ్కారః.

టీ. కుమార=ఓరాజకుమారా! లోకే=లోకమందు. యేసాధవః=ఎవరు సజ్జ నులో, యాఃసాధ్వ్యశ్చ=ఎవరు పతివ్రతలో, యే పితృదైవతాః=ఎవరు తల్లిదం డ్రులే దైవముగాఁగలవారో, యే స్వధర్మరతాః=ఎవరుతమకులాచారమందునాసక్తి గల వారో, సర్వే తే=అయందఱు, తమసుకృతములచే, త్వాం=నిన్ను, అవంతు=రక్షించె దరుగాక. తుల్యయోగితాలంకారము.

శ్లో. చరాచర మిదం విశ్వం, సురాసురనరాత్మకమ్
లీలా యస్య స దేవోస్తు, కుమార! శ్రేయసే తవ. ౧౬

కం. దేవాసురనరరూపము
స్థావరజంగమము నగుచుఁదర్శింపఁగ నా
నీవిశ్వ మెవనివిలసన
మావేలుపు నీకు శుభముఁ • డగును! కుమారా. ౧౬

వ్యా. చరాచరమితి. సర్వస్య ప్రాతిపద్యేన శ్రీవేఙ్కటకుమారమహీపతి సూర్యనారాయణస్య రక్షణార్థం వక్తు మశక్యత్వా త్సర్వమయో భగవా న్నారాయణ స్తవ చ్ఛ్రేయసే స్త్వితి సఙ్గ్రహేణ నాశీర్వచనమాహ హే కుమార! చరాచరం=స్థావరజఙ్గమా త్మకం, సురాసురనరాత్మక మితి పునర్గ్రహణం ప్రాధాన్యాభిప్రాయక మితి జ్ఞేయం.

ఇదం పరిదృశ్యమానం సర్వం యస్యభగవతో లీలా. ఉక్తంచ. "శయ్యా యస్య ద్భుజా శ్చ జోతి సకలచ్ఛస్థాంసి యద్వాహనం, లీలా యస్య జగన్తి కాలకలనా మూలం చ యల్లోచనం, నిద్రా జాగృతి రేవ యస్య నిగమస్తోమావతం సోత్పలం దేవః పుష్యతు రజ్ఞమజ్గళనిధి శ్ర్శ్రియాంసి భూయాంసి నః." ఇతి. స నారాయణః ప్రసిద్ధో దేవః తవ శ్రేయసే అస్తు. పర్యాయోక్త మలఙ్కారః, ఛేకానుప్రాస శ్చ తయోస్సంసృష్టిః.

టీ. ఈరాజకుమారునకు రక్షణనిమిత్తము వేఱు వేఱు దేవతల స్తవముచేయుట యశక్యము గాన సర్వదేవమయుం డగునారాయణుని( బేర్కొనుచున్నాడు. కుమార=ఓరాజకుమారకా! చరాచరం=స్థావరజంగమరూపమైనట్టియు, సురాసుర నరాత్మకం=దేవతలు రాక్షసులు మనుష్యులు వీరల రూపమైనట్టియు, ఇదం సర్వం-ఈసమస్తమగుప్రపంచము, యస్య=ఏభగవంతునియొక్క, లీలాః=విలాసములో, సః దేవః-ఆభగవంతు( డగునారాయణుండు, తవ=నీయొక్క, శ్రేయసే-శ్రేయస్సుకొఱకు, అస్తు-అవు(గాక. పర్యాయోక్తాలంకారముఛేకానుప్రాసమును నీరెంటికిసంసృష్టి.

శ్లో. య శ్చానపోత్తమా నేడి, త్యన్వర్థో రావు సన్తతౌ
వంశే భరతవ త్ప్రారోః కుమార! జయ తం గుణైః. ౧౭

తే. మఱియు ననపోత్తమా నేట్సమాఖ్య నెవ(డు
రావువంశంబునందు సార్థకత నొందె
భరతుడును బోలె బూరునివంశమందు
నతనిగుణములచే మించుమా కుమార! ౧౭

వ్యా. య ఇతి. య శ్చ పుమాన్ రావున న్తతౌ=రావుసంజ్ఞకాన్వయే, అన పోత్తమా నేడితి=అనన్తీత్యనాః జనా ఇత్యర్థః. "అన ప్రాణనే" ఇతిధాతుః, తాన్ పాన్తీతి అనపాః రాజానః పాలకాః ఇతిధాతోః అనపోత్తమా నేట్ తేషా ముత్తమః అనానామీట్=అనేట్ అనపోత్తమ శ్చాసౌ అనేట్చ ఇతి విగ్రహః; యద్వా ఉత్తమా దన్యోపోత్తమః స నభవతీతి అనపోత్తమః నచాసావనేట్చ అన పోత్తమానేట్ అపాన్యథాత్వే విశ్లేష ఇత్యుపసర్గవృత్తా. అన్ధ్రభాషాయాం తు తద్భవవిధా వర్ణాగమ వర్ణలోప వర్ణవ్యత్యయ వర్ణవికారాః స్యురితి నియమా త్తకారోపరివిద్య మాన తకారస్య మ కారోపరివిద్యమానాకారస్య చ లోపేటకారస్య ద కారాదేశే

ఉత్పాగమేచ అనపోతమనీడితిరూపం నిర్వృత్తమితి జ్ఞేయం సః పూరోర్వంశే భరత ఇవ అన్వర్థః=అనుగతార్థః సార్థకనామేతి యావత్. గుణైః=శౌర్యౌదార్యదయాదాక్షిణ్యాదిభిః తం ప్రసిద్ధం పూర్వోక్తం తవపూర్వకం జయ=తదతిశాయీ భవ, "పుత్రాదిచ్ఛేత్పరాజయ"మితి న్యాయ మనుసృత్య పూర్వకా అపి స్వవంశ్యైః కృతాం పరాభూతిం స్వేషాం పరాంభూతి మేవ మన్యన్త ఇతి అతో న పరాభవశఙ్కా కార్యేతి జ్ఞేయం తస్మాదప్యధికగుణవత్తరో భవేత్యభిప్రాయః. ఉపమాలఙ్కారః.

టీ. హేకుమార=ఓ రాజకుమారా! యశ్చ=ఏపురుషుఁడు, రావుసంతతౌ=రావు వంశమందు, అనపోత్తమా నేడితి=అనపోతమనీఁడని, పూరోః=పూరునియొక్క, వంశే=వంశమందు, భరతవత్=భరతునివలె, అన్వర్థః=సార్థకనామము గలవాఁడో, తం=ఆ యనపోతమనీనిని, గుణైః=శౌర్యము ఔదార్యము దయ దాక్షిణ్యము మొదలగుగుణములచే, జయ=అతిశయింపుమా; పుత్రునివలన వచ్చుపరాభవము జనకునకు సంతోషకరము గావున నిచ్చట పూర్వులఁ బరాభవింపుమా యనుపరాభవదోషము శంకింపఁగూడదు. అనఁగా నంతకంటె నధికుఁడవు గావలె నని యభిప్రాయము. ఉపమాలంకారము.

శ్లో. సర్వజ్ఞమాధవౌ తస్య, శైవవైష్ణవధర్మిణౌ
వంశాద్యా వః కుమార! త్వం, భవ తాదృక్కులస్థితిః. ౧౮

తే. తత్తనుజులు సర్వజ్ఞమాధవు లనంగ
శైవవైష్ణవధర్ము లై తీవి గనిరొ
మీరదయినయన్వయంబున నాదిపురుషు
లట్టివంశోచ్ఛ్రయముఁ బొందుమా కుమార! ౧౮

వ్యా. సర్వజ్ఞ ఇతి॥ హేకుమార! శైవాః=శివభక్తాః, వైష్ణవాః=విష్ణుభక్తాః, తేషాం ధర్మావాచారావనయోస్త ఇతి తథోక్తౌ. ధర్మశీలవర్ణాన్తాచ్చేతి ఇనిప్రత్యయః. తస్య=అనపోత్తమనృపస్య సమ్భూతినా సుతా విత్యర్థః. సర్వజ్ఞమాధవౌ=తన్నామకపుమాంసౌ చ, తయోః ప్రథమ శ్శైవధర్మీ ద్వితీయో వైష్ణవధర్మీతి ప్రసిద్ధిః. వః=యుష్మాకం, అత్ర బహువచనగ్రహణం సర్వేషాం రావువంశ్యానా మితి ద్యోతయితుం, వంశస్యాద్యౌ=పూర్వకౌ కూటస్థా విత్యర్థః. అభూతా మితి శేషః. త్వం, తాదృక్కులస్థితి ర్మర్యాదా యస్యేతి తథోక్తః భవ తావివవర్తస్వేత్యర్థః. కథం శైవవైష్ణవ ధర్మయోః

పరస్పరవిరుద్ధత్వా ద్వైష్ణవధర్మిణా యుష్మాకం శైవధర్మపరిగ్రహ ఇతి శఙ్కా న కార్యా. ధర్మో ద్వివిధః బాహ్య ఆన్తరఙ్గిక శ్చేతి. “యే బాహుమూలపరిచుమ్బిత శఙ్ఖచక్రా, యే కణ్ఠలగ్నతులసీనలినాక్షమాలాః, యే వా లలాటఫలకే లసదూర్ధ్వ పుణ్డ్రా), స్తే వైష్ణవా భువనమాశు పవిత్ర యన్తీ”తి బాహ్యలక్షణో ధర్మః. “సర్వ భూతేషు యః పశ్యే ద్భగవద్భావమాత్మనః, భూతాని భగవ త్యాత్మ, న్యేష భాగవత స్స్మృత” ఇత్యాన్తరఙ్గికధర్మః. తయో రాన్తరఙ్గికధర్మ ఏవ ప్రధానమ్. న బాహ్యః. ఉక్తం చ మనునా. “భూషితోఽపి చరే ద్ధర్మం, యత్ర కుత్రాశ్రమే వసన్। సమ స్సర్వేషు భూతేషు, న లిఙ్గం ధర్మకారణ”మితి. యాజ్ఞవల్క్యోఽపి. “నాశ్రమః కారణం ధర్మే, క్రియమాణో భవేద్ధి సః। అతో యదాత్మనః పథ్యం, పరేషాం న తదా చరే”దితి. “సత్య మస్తేయ మక్రోధో, హ్రీ శ్శౌచం ధీ ర్ధృతి ర్దమః। సంయతేన్ద్రి యతా విద్యా, ధర్మ స్సర్వ ఉదాహృత” ఇతి. అన్యచ్చ. “అహింసా సత్య మస్తేయం, శౌచ మిన్ద్రియనిగ్రహః। దానం దమో దయాక్షాన్తి స్సర్వేషాం ధర్మసాధన”మితి. ఏవం చ బాహ్యైర్వైష్ణవధర్మచిహ్నితేనాపి, అన్తరఙ్గే శివకేశవయో రభేదబుద్ధిః కర్త వ్యేతి తాదృశ్యా లక్షితిరితి కవినోక్తం. మను నాపి “ఆపో నారా ఇతి ప్రోక్తా, ఆపో వై నరసూనవః, తా యదస్యాయనం పూర్వం, తేన నారాయణ స్స్మృత” ఇతి నారాయణ స్యైవ పరత్వేన నిశ్చితత్వాచ్చ నారాయణోపపత్తిః కర్తవ్యేమనువచనస్యా పరిహార్య త్వాదేవం శివేపి తద్బుద్ధ్యా వా తద్భక్తేష్వప్యేవ మేవ కర్తవ్యం అన్యే దేవా స్తు తద్భక్తా శ్చైవమేవానువర్తితవ్యాః. “సర్వవేదమయో విప్ర స్సర్వదేవమయో హరి” రిత్యుక్త త్వాదన్యథా చేదుభయత్ర శ్రేయోహానిస్స్యాదితి “బ్రహ్మాణ మర్క మీశానం, విష్ణుం వా ద్వేష్టి యో నరః, శ్రేయాంసి తస్య నశ్యన్తి, రౌరవం నరకం వ్రజే” దితి స్మరణాచ్చ తథైవోక్తం. వైష్ణవధర్మస్వీకారస్తు, “యేనాస్య పితరో యాతాః, యేన చాస్య పితామహాః। యేన యాయాత్సతాం మార్గం, తేన గచ్ఛ న్నదుష్యతీ”తి. ఇత్థ మాలోచ్య సర్వేషు దేవేష్వపి భక్తిమాంశ్చేత్ తవ ధర్మార్థకామోపయోగిమఙ్గళపరమ్పరావాప్తి స్సిద్ధ్యతీతి జ్ఞేయం చ. అత్ర “సర్వజ్ఞమాధవావేవ సర్వజ్ఞమాధవా” శివకేశవా వితి శ్లిష్టరూపకం; అనేనాస్య వంశస్య మహామహిమత్వముక్తం; తన్మహామహిమత్వం స్యాద్వాక్యపునరేక వతా త్మతే త్యుక్తత్వాత్.

టీ. కుమార=ఓరాజకుమారా! శైవవైష్ణవధర్మిణౌ=శివమతము వైష్ణవమతము కలిగినవట్టి, సర్వజ్ఞమాధవౌ=శివకేశవులు, తన్మూలమునకు పురుషులును. పిరితో సర్వజ్ఞుడు

శివభక్తుఁడనియు, మాధవరావు విష్ణుభక్తుఁడనియుఁ బ్రసిద్ధి కలదు. వః=మీయొక్క, వంశాద్యాః=వంశమునకు మొదటివారలో; ఇచ్చట వః యను బహువచనప్రయోగముచే మీరావువారి కందఱకని యభిప్రాయము. త్వం=నీవు, తాదృక్=అట్టి శైవవైష్ణవధర్మములు తెలిసినట్టి, కుల=వంశముయొక్క, స్థితిః=మర్యాదకలవాఁడవు,భవ=అవుము. అనఁగా నాయుభయులధర్మము నిన్నుఁ బొందుఁగాక యని యభిప్రాయము. పరస్పర విరుద్ధము లగు శైవవైష్ణవధర్మములు కేవలము వైష్ణవధర్మావలంబు లగువారెట్లు గ్రహింపవచ్చు నను శిష్యసందేహము విషయమై సమాధాన మెట్లన్న:—ధర్మము బాహ్యము ఆంతరంగిక మని ద్వివిధము. భుజములందు శంఖచక్రచిహ్నములు ధరించుట, తులసీ మాలలు కంఠమందు ధరించుట, నొసట నూర్ధ్వపుండ్రములు ధరించుట, యీమొదలగు లక్షణములు గలవైష్ణవులు లోకములను బవిత్రముఁ జేయుదు రనునది బాహ్యధర్మము. తనయాత్మయందును సకలభూతములందును భగవద్భావముంచి భగవంతునియందుఁ దనయాత్మను సమస్తభూతముల నుంచువాఁడు భగవద్భక్తుఁ డనునది యాంతరంగిక ధర్మము. ఈ రెండు ధర్మములలో నాంతరంగికధర్మమే ప్రధానము గాని బాహ్యధర్మము ప్రధానము గాదు. ఇందులకు మనువచనము "ఏయాశ్రమమందైనఁగాని యేచిహ్నాలు ధరించిగాని సమస్తభూతములయందు సముఁడు గావలెననియుఁ జిహ్నములు ధర్మకారణములు గావనియు" "ఆశ్రమము ధర్మకారణము గాదనియు భూతహితముగ సంచరింపవలయు ననియు సత్యము, దొంగలింపమి, కోపములేమి, శుచి, బుద్ధి, ధైర్యము, బహిరింద్రియనిగ్రహము, అంతరింద్రియనిగ్రహము, అనఁబడునీయవి ధర్మములనియు నహింస, సత్యము, అస్తేయము, దానము, భూతదయ, యివియే ధర్మసాధనము" లనియు యాజ్ఞవల్క్యుఁడును నిందుచే బాహ్యమందు వైష్ణవధర్మములచేఁ జిహ్నితుఁడైనను నంతరంగమందు శివకేశవులకు నభేద మని తెల్పు తాత్పర్యంబునఁ దాదృక్కులస్థితి యని కవి వచించినాఁడు. నరునకుఁ బుట్టిన వగుటచే నుదకములకు నారము లనియు నవి స్థానముగలవాఁడు నారాయణుండనియు, నట్టినారాయణుండే పరతత్త్వ మని మనువు నిశ్చయించుటవలనను, సకలవేదస్వరూపుఁడు విప్రుఁడనియు సకలదేవస్వరూపుఁడు విష్ణువని శివకేశవులకు భేదము లేకపోవుటవలనను, బ్రహ్మను సూర్యుని శివుని విష్ణువును ద్వేషించువారు శ్రేయోహీనులై రౌరవనరకమును బొందుదు రను స్మృతివలనను నట్లు చెప్పంబడె. వీరికి వైష్ణవధర్మము గ్రహించుట ముఖ్యధర్మ మెట్లన్నఁ దమ తండ్రులు తమతాతలు మొదలగుతమవారి లవలంబించు మార్గము తొలఁగవిడఁగూడద

నియు నట్లు విడనాడిన శ్రేయోహాని గలుగు నని స్మృతులు చెప్పుచున్నవి. అందుచే సకలదైవతములందు భక్తి నుంచవలయు ననియు నట్లు ప్రవర్తించిన సర్వశ్రేయస్సాధనం బగు ననియు నీశ్లోకమునఁ దేలుచున్నది. ఇందుచే నీరాఘవంశము మహామహిమగల దని తోఁచుచున్నది. సర్వజ్ఞమాధవు లనెడి సర్వజ్ఞమాధవు లనఁగా శివకేశవులు తోఁచుచున్నారు.

శ్లో. శ్లోకాయత్తా స్స్వర్థపరా, గురవో లఘవో గణాః
నిర్దుష్టా స్తే భావమతా, స్స్యుఃకుమార! నిరన్తరాః. ౧౯.

తే. స్వర్థపర మఱిశ్లోకవంశత్వదోష
రహిత రీతిని దనరి నిరంతరగతి
గురువులు లఘువులును నగుఁనురుగణములు
నీకు భావమతంబు లౌఁనోకుమార! ౧౯.

వ్యాఖ్యా. శ్లోకేతి. హేకుమార! గురవః=“సానుస్వారో విసర్గాంతో దీర్ఘో యుక్తపరశ్చ యః, గురు మేతం విజానీయా” దిత్యుక్తలక్షణాః వర్ణాః, లఘవః=“అన్యో లఘురుదాహృత” ఇత్యుక్తలక్షణా శ్చ, గణాః=“ఆదిమధ్యావసానేషు, యరతా యాన్తి లాఘవమ్, భజసా గౌరవం యాన్తి మనౌతు గురులాఘవమ్” ఇత్యుక్త లక్షణాః గణా శ్చ, శ్లోకాయత్తాః=శ్లోకత్వేననిర్మితాః, స్వర్థపరాః=శోభనః అర్థో వాచ్యలక్ష్యవ్యంగ్యత్వేన త్రివిధోర్థః తస్మి న్పరాః, నిర్దుష్టాః=పదగతవాక్యగతాదిదోష రహితాః భావేన=అభిప్రాయేణ, మతాః=సమ్మతాః, నిరన్తరాః=విచ్ఛేదరహితాః తే=తుభ్యం, స్యుః=భవద్గుణవర్ణనాయాఃచన్ద్రతారకం భవేయు రితి భావః.

అన్యత్ర గురవః=ఉత్తమాః, లఘవః=అధమాః, గురవో లఘవః=లఘ్వపేక్షయా గురవః గుర్వపేక్షయా లఘవః మధ్యమా ఇత్యర్థః; గణాః=గణకశేఖరాదిరాజపురుషాః, శ్లోకస్యాయత్తాః=కీర్తిమంత ఇత్యర్థః, స్వర్థపరాః=సు=అతీవ, అర్థపరాః=ప్రయోజనపరాః, నిర్దుష్టాః=ధర్మాదిపరీక్షణేనోపధాశుద్ధాః, భావస్య=యుష్మదభిప్రాయస్య, మతాః=సమ్మతాః, నిరంతరాః=నిరవకాశాః, నీరంధ్రావాకస్స్యుః=గణశబ్దస్య వ్యవహార్య వాచ్యకత్వే ప్రయోగోప్యస్త్యేవ “కులాని జాతీ శ్శ్రేణీ శ్చ, గణాన్ జానపదా నపి, స్వధ

ర్మాచ్చలితాన్ రాజా, వినీయ స్థాపయే త్సుధీ" తియాజ్ఞ వల్క్యః. శ్లేషాలజ్కారః.

టీ. కుమార=ఓరాజకుమారా! గురవః=గురువర్ణములును, లఘవః=లఘువర్ణములును, గణాః=గణములును, శ్లోకాయత్తాః=శ్లోక రూపముగ నిర్మింపఁబడినవై, స్వార్థపరాః=మంచియర్థమును జెప్పుచున్నవై, నిర్దుష్టాః=దోషములులేనివై, భావమతాః=అభిప్రాయముచే సమ్మతములై, నిరంతరాః=శాశ్వతములై, తే=నీకొఱకు, స్యుః=కాఁగలవు, చంద్ర సూర్యు లున్నంతవఱకు మీగుణముల వర్ణించుఁగాక యని భావము.

రెండవయర్థము. గురవః=ఉత్తములైనట్టియు, లఘవః=అధములైనట్టియు, గురవ్లో లఘవః=మధ్యములైనట్టియు, గణాః=రాజపురుషులు, శ్లోకాయత్తాః=కీర్తికాలులై, స్వార్థపరాః=తమతమప్రయోజనములం దాసక్తులై, నిర్దుష్టాః=ధర్మము మొదలగుపరీక్షలచే శుద్ధులై, భావమతాః=మీయభిప్రాయమునకిష్టులై, నిరంతరాః=ఎడతెగనిసంబంధముగలవారై, తే=నీకొఱకు స్యుః=కాఁగలరు, శ్లేషాలంకారము.

శ్లో. సాన్త్వం మాన్యే ధనం దీనే, శఠే భేద మరౌ దమమ్
కుమార! పాతయద్ధియా, విమృశ్య గురులాఘవమ్. ౨౦.

కం. గురులఘుభావంబుల మతి
నరసి గురువులయెడ సామ • మర్థము దీనో
త్కరము నెడ శఠుల భేదం
బరియెడ దండమును జొనుపు•మయ్య కుమారా! ౨౦.

వ్యా. సాంత్వ మితి॥మాన్యే=పూజ్యే విషయే, సాన్త్వం=సామవచనం యూయం మహాత్మానః యుష్మద్దర్శనే నాహమేవ మదీయా ఇమే చ కృతార్థా ఇత్యాది దేశకాలపాత్రాదీ న్విమృశ్య గౌరవలాఘవేచ విమృశ్య పాతయేతి సర్వత్ర సమ్బన్ధః, దీనే=దరిద్రే, ధనం=పాత్రత్వాదిత్యర్థః, అపకర్తుం మనుష్యద్యుక్తో బహి రుప కర్తు మివ యో వర్తతే స శఠః. తస్మి న్విషయే భేదం=ఉపజాపం, త్వం మమ పరమాప్తః త్వాం నవిసృజామి త్వదధీన మేవ మదీయం సర్వ మిత్యాది కైతవవచోరూపం. అస్పష్టాపరాధిత్వాదిత్యర్థః. అరౌవిషయే, దమం=దండం ధిగ్వాగర్థవధరూపంచతుర్విధం ఇద ముపాయచతుష్టయం గృహస్థవిషయ మేవ ఉక్త మితిజ్ఞేయం. ఉత్తరత్రరాజపక్షేవక్ష్యమాణత్వాత్. సర్వత్రాపి ప్రయోక్తవ్యం వా. "అధీ ష్వ పుత్రకాధీష్వ, తవదా

స్యామి మోదకాన్, యద్వాన్యస్మై ప్రదాస్యామి కర్ణముత్పాటయామితి" ఇత్యుక్తత్వాత్ యథాసఙ్ఖ్యాలఙ్కారః.

టీ. కుమార=ఓరాజకుమారా! మాన్యే=పూజ్యునియందు, సాంత్వం=మంచి మాటలను, దీనే=దరిద్రునియందు, ధనం=ద్రవ్యమును, శఠే=అపకారబుద్ధికలిగి యుప కారివలె నటించువాఁడు శఠుఁడు అనఁగా వంచకుఁడు, వానియందు భేదం=కపట పుమాటలను, అరౌ=శత్రువునియందు, దమం=దండమును. దండము నాల్గువిధములు నింద, దూషణ, దండుగ విధించుట, శిక్షించుట, యని, గురులాఘవం=నేరములయొక్క హెచ్చుతగ్గులను, విమృశ్య=ఆలోచించి, పాతయ=ప్రవేశింపఁజేయుము; ఈ యుపా యచతుష్టయము గృహస్థుఁ విషయమై ప్రయోగింపఁదగినది. రాజాలవిషయమై ముందు చెప్పఁబోవుచున్నాఁడు. ఈశ్లోకంబున యథాసంఖ్యాలంకారం బని యెఱుంగునది.

శ్లో. పద్మనాయకవిఖ్యాతి, స్త్వయ్యైవ భవతు స్థిరా
యత శ్శ్రీసూర్యనామా త్వం, కుమార సుగుణాకరః.

గీ. పద్మికతమున శ్రీసూర్యనామధేయుఁ
డవును సుగుణాకరుండ వైతివో కుమార!
యట్టికతమునఁ బద్మనాయకఘనప్ర
తీతి నీయది యౌఁగాక తిరముగాఁగ! ౨౧.

వ్యా. పద్మనాయకేతి. హేకుమార! పద్మనాయకాఖ్యసంబంధీ తజ్జాతీయ ఇత్యర్థః; పద్మానాం=కమలానాం, నాయకః=సూర్య శ్చ, పద్మాయాః=లక్ష్మ్యాః నాయకః=విష్ణు శ్చ "వ్యా" "జ్యాపోస్సంజ్ఞాచ్ఛందసోర్బహుళ" మితిసూత్రేణ హ్రస్వ ఇతి బోధ్యం. అథవా పద్మా=లక్ష్మీః అస్యాస్తీతిపద్మః=విష్ణుః, అర్శ ఆది త్వాత్ అచ్ప్రత్యయాంతః సచాసౌనాయకః పద్మనాయక ఇతివిగ్రహః. ఏవం త్రివిధ పద్మనాయకానాం విశేషేణ భేదేన యా ఖ్యాతిః=ప్రసిద్ధిః పద్మనాయకవిఖ్యాతిః త్వం యతో=యస్మాత్కారణాత్ సూర్య ఇతి నామయస్య తథోక్తః యత శ్శోభనానాం గుణానా మాకర శ్చ తత్కారణా త్త్వయ్యైవ=ఏవకారో వస్త్వంతరవ్యవచ్ఛేదార్థః. స్థిరా=శాశ్వతీ భవతు. లోకే జాత్యా పద్మనాయకేషు విద్యమానేష్వపి తేషాం న సూర్యనామ సుగుణాకరత్వే, సూర్యనామ్ని విద్యమానేఽపి న సుగుణాకరత్వ పద్మనా యకజాతిత్వే, అత స్త్వమేవ సర్వప్రకారేణ సుగుణాకరే విద్యమానేఽపినతస్య

సూర్యనామ పద్మనాయకజాతిత్వే, పద్మనాయక ఇతిసిధ్యతి నామ్నా సూర్యసామ్యం సుగుణై రస్య విష్ణుసామ్యం గమ్యతే. అత్ర కావ్యలింగోజ్జీవితశ్లేషాలఙ్కారః. ప్రసాదోనామగుణశ్చ. "ప్రసిద్ధార్థ పదత్వం య త్సప్రసాదోనిగద్యత" ఇత్యుక్తత్వాత్.

టీ. కుమార=ఓరాజకుమారా! పద్మనాయకవిఖ్యాతిః=పద్మనాయకవంశమందుఁ బుట్టుటచేఁ బద్మనాయకుఁడనియు, పద్మ=పద్మములకు, నాయకుఁడు=ప్రభువు సూర్యుఁడు, పద్మ యన లక్ష్మీదేవి ఆమెకు నాయకుఁడు విష్ణువు. ఈభేదములఁ బద్మనాయకప్రసిద్ధి యతః=ఏకారణమున త్వం=నీవు, సూర్యనామా=సూర్యనామముగలవాఁడవును, సుగుణాకరః=సద్గుణములకు స్థాన మైనవాఁడవో, తతః=ఆకారణమువలన, తవైవ=నీకే, అనఁగా నితరులకుఁజెల్లనేర దనుట, స్థిరా = శాశ్వతమైనది, భవతు = అవుఁగాక. లోకమున మీజాతీయు లగుపద్మనాయకులు కొందఱుండియు వారికి సూర్యనామధేయము సుగుణములునుండ నేరవు; సూర్యనామధేయముండినను, సుగుణములు పద్మనాయకజాతియు నుండదు. సుగుణము లుండినను సూర్యనామము పద్మనాయకజాతియు నుండదు. ఆహేతువుచే నీవే సమస్తవిధములచేఁ బద్మనాయకుఁడ వని తోఁచుచున్నది ఇచ్చట నామధేయముచే సూర్యసామ్యమును సుగుణములచే విష్ణుసామ్యమును దోఁచుచున్నది. కావ్యలింగోజ్జీవితశ్లేషాలంకారము. ప్రసాద మనుగుణమును.

శ్లో. పద్మనాయక సామ్యాత్త్వాం, పద్మినీరూపధారిణీ
ముదితా త్వత్కరాకృష్టా, కుమార! భజతు స్స్వయమ్.

తే. పద్మనాయకసామ్యంబు • వలన నిన్ను
మూర్తిమతి యగుచుఁ బద్మిని • ముదితవృత్తిఁ
దావకీనకరాకృష్ట • తానిరూఢిఁ
బూని తాను భజించుఁగా • వుతఁ గుమార! ౨౨.

వ్యా. పద్మనాయక ఇతి. హేకుమార! పద్మనాయకానాం పూర్వోక్తానాం సామ్యాత్=సమత్వాత్, పద్మినీ=శంఖినీ హస్తినీ చిత్రిణీ పద్మినీతి కామశాస్త్రప్రసిద్ధాస్త్రియః, తాస్వేకా. ఉక్తంచ రతిరహస్యే. "పద్మగన్ధవదనా సుకపోలా మన్దగా తనుపదబ్జుళగుహ్యా, దానధర్మనిరతా కృతపుణ్యా పద్మినీ విబుధభాషణలోలే"తి, ఏవముక్తప్రశస్తలక్షణా సాచ పద్మానిఅస్యాసన్తీతి పద్మినీ=బిసినీచ, పద్మం = కమలం

అస్యాఅ స్త్రీతి లక్ష్మీశ్చ రూపధారిణీ సకలసౌభాగ్యావహసౌన్దర్యస్వరూపం దధతీసతీ, త్వత్కృ-రాకృష్టా, ముదితా=సన్తుష్టా శోభనో అయో శుభావహవిధి ర్యస్మిన్కర్మణి తద్యథా యద్వా స్వయం=ఆత్మనావా, త్వాం భజతు, "భజసేవాయా" మితిధాతుః, పద్మినీకరగ్రహణేనాన్యనాయకస్య పాఞ్చాలజాతిపురుషత్వం ధ్వన్యతే. భద్రదత్త కూచిమారపాఞ్చాలాఇతికామశాస్త్రప్రసిద్ధాః. "ఏతాదృశైర్గుణై ర్యుక్తః. పాఞ్చాలః పద్మినీంవ్రజే"దితి. అత్రశ్లేషమూలకావ్యలిఙ్గమ్. అత్ర గామ్భీర్యంనామ గుణశ్చ.

టీ. కుమార=ఓరాజకుమారక! పద్మనాయకసామ్యాత్ = పూర్వమందుఁజెప్పఁబడినపద్మనాయకుల సామ్యమువలన, పద్మినీ=పద్మినీజాతి స్త్రీ, హస్తిని, శంఖినీ, చిత్రిణీ, పద్మిని, యనునాల్గువిధము లగు స్త్రీలలో నొకతె యగు, పద్మినీజాతి స్త్రీ. ఆమె లక్షణము. పద్మమువలెఁబరిమళించుముఖము గలదియు, నొప్పుచున్నచక్కనిచెక్కిళ్లుగల దియు, మెల్లగనడచునదియు, నాఱంగుళములప్రమాణముగల గుహ్యప్రదేశము గలదియు, దానధర్మములయందుఁదాత్పర్యముగలదియుఁ, బతివ్రతయుఁ, బెద్దలతో మాట్లాడుటయం దాసక్తిగలదనియు లక్షణము. పద్మిని యనఁ బద్మలత, లక్ష్మీదేవియు, రూపధారిణీ=సౌందర్యమునుధరించునది, స్వయం = స్వయముగా, త్వాం = నిన్ను, భజతు=సేవించుఁగాక; పద్మినీజాతి స్త్రీని గ్రహించుటచే నీనాయకుఁడు పాంచాల జాతిపురుషుఁ డౌట ధ్వన్యర్థము. భద్రుఁడు, దత్తుఁడు,కూచిమారుఁడు, పాంచాలుఁడని కామశాస్త్రప్రసిద్ధులు. శ్లేషమూల మగుకావ్యలింగాలంకారము.

శ్లో. శ్రియ స్స్త్రియ స్త్వయా సేవ్యా, స్త్రివర్గఫలమిచ్ఛతా
త్రేధా విభజ్యసమయం, కుమార! సమమన్వహమ్.

తే. సిరులు నవరోధసుందరుల్ • సరిగమూఁడు
గతులుగాఁ గాలసంవిభాగం బొనర్చి
ప్రతిదినంబుఁ గుమార! • త్రివర్గఫలముఁ
దలఁచునీచేత సేవింపఁ • దగుదు రయ్య. ౨౩.

వ్యా. శ్రియ ఇతి. హేకుమార! శ్రియః=రాజ్యసమ్పదః, స్త్రియః=పాణిగృహీత్యః మానిన్యః. అత్రస్త్రియ ఇతి బహువచనేన. "పాన మక్షా స్త్రియ శ్చైవ

మృగయాచ యథాక్రమం, ఏతత్కష్టతమం విద్యా చ్చతుష్కం కామజేగణే" ఇత్యుక్త
మనువచన మన్యదీయా సామాన్యా నిషేధపర మితి జ్ఞేయం "భుక్త్వాన్విహరేచ్చైవ
స్త్రీభి రంతఃపురేసహే"తి. తేనైవానుజ్ఞాతత్వాత్. త్రయాణాం=ధర్మార్థకామానాం
వర్గః తస్యఫలం ప్రాప్తు మితి శేషః, ఇచ్ఛతాత్వయా అన్వహం=ప్రతిదినం, సమయం
దివాకాలం త్రేధా=త్రిప్రకారేణ పూర్వాహ్ణమధ్యందినాఽపరాహ్ణభేదేన విభజ్య
సమం యథాతథా సేవ్యాః ఉపభోగ్యాః. "ధర్మార్థకామాన్స్వే కాలే, యథాశక్తి నహా
పయే" దితియాజ్ఞవల్క్యశ్చ. "నపూర్వాహ్ణమధ్యందినాపరాహ్ణానఫలాన్కుర్యాద్ధర్మార్థ
కామేభ్య స్తేషు ధర్మోత్తరస్స్యా" దితి గౌతమ శ్చ. స్త్రీసఙ్గమస్య దివా నిషిద్ధత్వా
త్కథ మపరాహ్ణే స్త్రీసేవన మితి నాశఙ్కనీయం బాహ్యాభ్యన్తరత్వేన సంభోగో ద్వి
విధః. కచాకర్షణ కుచస్పర్శన గణ్డచుమ్బ నాలిఙ్గన సరససంభాషణ సంవ్యానాపకర్ష
ణాదిరూపో బాహ్యః; రత్యుపరతి బద్ధాత్మకస్త్వాభ్యన్తర ఇతి తత్ర, "భుక్త్వా
న్విహరేచ్చైవ స్త్రీభి రన్తఃపురే సహే"తి మనువచనేన స్త్రీబహుత్వప్రతిపాదనేన
బాహ్యసంభోగ ఏవానుమతః నత్వాభ్యన్తరస్సంభోగ స్తస్యద్వాభ్యాం స్త్రీపురుషా
భ్యా మేవ ప్రవర్తయితవ్యత్వా న్నిశాయా మేవ ప్రసిద్ధత్వాచ్చఅన్యథా లజ్జాహానిస్స్యా
త్, నచ బహుశరిగ్రహసంగ్రహో స్త్వయుక్త ఇతి వాచ్యం. యుక్తమేవ, "లోకా
నంత్యం దివఃప్రాప్తిః పుత్రపౌత్రప్రపౌత్రకైః, యస్మాత్తస్మాత్స్త్రియ స్సేవ్యాః కర్తవ్యా
శ్చ సురక్షితా" ఇతి యాజ్ఞవల్క్యోక్తేః తథాపి "విరుద్ధం వర్జయే త్కర్మే"తి స్మరణా
జ్జనపదకులాచారగ్రామవిరుద్ధం యథా న భవతి తథైవ తే స్త్రీసేవనం భవతు.

టీ. కుమార=ఓరాజకుమారా! శ్రియః=రాజ్యసంపదలును, స్త్రియః=భార్యలు
ను,ఇచ్చట స్త్రీలనుబహువచనప్రయోగము,పానము జూదము స్త్రీలు వేట యును గూడ
దనుమనువచనము పరస్త్రీ వేశ్యల విషయ మని తెలియవలయును, భుజించినతోడనే
స్త్రీలతో నంతఃపురంబున విహరింపవలయుననిన మనువు ననుజ్ఞచే స్త్రియః యనిచెప్పి
నాఁడు. త్రివర్గఫలం=ధర్మార్థకామములయొక్క ఫలమును, ఇచ్ఛతా=ఇచ్ఛయించుచున్న,
త్వయా=నీచేతను, అన్వహం=ప్రతిదినమందు, సమయం=పగటికాలమును త్రేధా=పూర్వా
హ్ణమధ్యందినాపరాహ్ణములను మూఁడువిధములుగా విభజ్య = విభజించి,సమం =
సమానముగా,సేవ్యాః=సేవింపఁదగినవారు, ధర్మార్థకామములను వానివానికాలముల
ననుష్ఠింపవలయునని యాజ్ఞవల్క్యగౌతములు చెప్పిరి,స్త్రీసంభోగము దివాకాలమందు
నిషేధ మగుటచే నపరాహ్ణమందు స్త్రీసంగమము గూడునా యని శంకింపఁజనదు.

సంభోగము బాహ్యము ఆభ్యంతర మని రెండువిధములు. కొప్పులాగుట స్తనములు స్పృశించుట చెక్కిలిముద్దాడుట ఆలింగనము సరసభాషణము పర్యంకమున దొలఁగించుట యనునవి బాహ్యసంభోగమనియు,రతి యుపరతి బంధములు మొదలగునవి యాభ్యంతరసంభోగమనియు స్త్రీలతో నంతఃపురంబున విహరింపవలయునని బహువచనము చెప్పుట పగటికాలమందుఁ జెప్పుటయు బాహ్యసంభోగ మని తోఁచుచున్నది. అభ్యంతరసంభోగమందు స్త్రీపురుషులు నిద్దఱుఁగూడిచేయునది, ఈరతి రాత్రియందుఁ బ్రసిద్ధము, పగటికాలమందైనచో లజ్జాహానియు దోషమును గలుగును. అనేకభార్యాసంగ్రహము దోషము గానేరదు. ఏమన ననేకభార్యలుండుటచే సంతానవృద్ధియై పుత్రులు పౌత్రులు ప్రపౌత్రులు మొదలగువారిచే వంశవిచ్ఛేదము లేకపోవుటయు వారుచేయు సత్కర్మలచే స్వర్గప్రాప్తియుఁగలుగునని యాజ్ఞవల్క్యస్మృతి చెప్పుచున్నది,అనఁగా దేశాచారకులాచార గ్రామాచారవిరుద్ధములేక దారసేవయగుఁగాక యని యాశీర్వచనము.

శ్లో. ప్రవన్మదపరిక్లిన్న,పద్మమాలాపరిష్కృతః
కుమార! పట్టభద్రేభ,స్త్వేగతో యాతు యూథపః. ౨౮.

కం. తొట్టిన మదమున డస్సిన
యట్టిసుపద్మతతి నందమై యూథప మా
పట్టపుభద్రేభము నీ
కట్టెదుటఁ నడచుచుండుఁగాతఁ గుమారా! ౨౮.

వ్యా. ప్రవదితి. పట్టేన=రాజ్యాభిషేక సమయలలాటనిక్షిప్తభూషణవిశేషేణ, భద్రః=శుభః తస్యసంబుద్ధిః హేకుమార! ప్రవత యోమదః తేనపరితః క్లిన్నాని పద్మాని= బిన్దుజాలకాని యద్వా అరవిన్దాని అలఙ్కారార్థం నిక్షిప్తాని తేషాం మాలాః రేఖా సజః తాభిర్విశేషేణ భేదేన భూషితః ఇభః=గజః,యద్వా పట్టేనభూషణవిశేషేణ. పట్టలక్షణంతు "రాజ్ఞాం నవాంగుళాయామో మధ్యేష్టాంగుళ విస్తృతం,చతురంగుళ విస్తార పార్శ్వస్స్వర్ణమయ శ్శుభః,పట్టః పంచశిఖోరాజ్ఞ ప్రజా సౌఖ్యసమృద్ధయే" ఇతి భద్రః=శుభః సచాసౌగజశ్చ యద్వా భూషణవిశేషయుక్తభద్రజాతిగజః.ఉక్తంచ రామాయణే. 'భద్రాన్ మన్ద్రాన్ మృగాంశ్చైవ, భద్రమన్ద్రమృగాం స్తథా,భద్రమన్ద్రాన్

ర్భద్ర మృగై ర్మృగభద్రై శ్చ సాఙ్కీర్ణైతి, యూథం=స్వసదృశానేకగజబృన్దం పాతీతి తథోక్తః. ని. "సజాతీయైః కులం యూథ" మిత్యమరః. "పా రక్షణే". తే=తవ, పురతః=అగ్రతః యాతు. అనేన గజసమ్పత్తి రుక్తా. స్వభావోక్తిశ్లేషాలఙ్కారయో స్సఙ్కరః.

టీ. పట్టభద్రేభ, పట్ట=రాజ్యాభిషేకసమయమున లలాటమం దుంచుభూషణ విశేషముచే, భద్ర=మంగళప్రదుఁడవగు, కుమార=ఓ రాజకుమారా! పట్టలక్షణము, శ్లోమ్మిది యంగుళములు పొడవును నాలుగంగుళములు వెడల్పును గలిగి సువర్ణమయ మైనకొన లుగలదై యైదు కొనలుగలది ధరించినయెడల రాజ్యమును బ్రజలను వృద్ధినొందించు నని స్మృతి. స్రవత్=స్రవించుచున్న, మద=మదముచే, పరిక్లిన్న=తడిసినట్టి, పద్మ=చుక్కల యొక్క, మాలా=పంక్తులచే, లేక, పద్మ=కమలములయొక్క, మాలా=మాలికలచే, విభూషితః=విశేషముగా నలంకరింపఁబడిన, ఇభః=ఏనుఁగు, మఱియుఁ, బట్టభూషణవిశేష ముచే, భద్ర=శుభమగు, ఇభ=గజము, మఱియు, పట్ట=భూషణవిశేషణముతోఁ గూడిన, భద్ర=భద్రజాతియందుఁ బుట్టిన, ఇభః=ఏనుఁగు. అనఁగాఁ బట్టపుటేనుఁగు, యూథపః= తనజాతియేనుఁగులకుఁ బ్రభువై, తే=నీయొక్క, అగ్రతః=ముందరను, యాతు=నడచుఁ గాక, దీనిచే గజసంపత్తి చెప్పఁబడెను. స్వభావోక్తిశ్లేషాలంకారములకు సంకరము.

శ్లో. పఞ్చధారాపరిక్షిప్త, రజోవాహం సమీరణమ్
అనుకర్తు మి వాశ్వా స్తే, స్యుః కుమార! జవాధికాః. ౨౫.

కం. తమనడలం బొడమువరా
గముఁ దాల్చినగాలిఁ బోలఁగా నొక్కొఱ యనం
గ మహాజవాధికంబులు
కుమార! భవదీయము లగుఁగుఱ్ఱంబు లగుఁగా. ౨౫.

వ్యా. పఞ్చధారేతి, హేకుమార! పఞ్చధారాః = ఆస్కన్దితాదిగతివిశేషాః, తైః పరితః క్షిప్తం=వ్యాప్తం యత్ రజః తద్వహతీతి తథావిధం. సమీరణం=వాయుం, అను=సమం, కర్తుమివ. యద్వా తాదృశవాయుం అను=పశ్చాత్ కర్తు మివ ని. "పశ్చాత్సాదృశ్యయో రను" రిత్యమరః కథమస్మాకం విశ్వవిశ్వమ్భరాభరణాయమాన సార్వభౌమస్యాస్య శ్రీవేఙ్కటకుమారమహీపతి సూర్యరాయస్యాశ్వానాం పృథాదోర్ధ

రజోవాహసమీరణేన సాకంగతి రితిబుద్ధ్యేతిభావః లోకేయథా మానినః నీచకర్తృభి స్సహ గమనం త్యజన్తి; తద్వదితిధ్వనిః, తే=అశ్వాః జవేనాధికాస్స్యుః, అనేనాశ్వ తురగసమ్పత్తిరుక్తా. అస్యగమనసమయే అనుకూలవాయుప్రసరణ మపి సూచితమ్.

టీ॥ కుమార=ఓరాజకుమార! పంచ=అయిదైనట్టి, ధారా=అశ్వగతులు మొదలగు గతివిశేషములతో, పరిక్షిప్త=వ్యాప్తమైన, రజోవాహం=ధూళినివహించుచున్న, సమీర ణం=వాయువును, అనుగంతుమిప=అనుసరించినడచుకొనుటకులేను, లేక అతిక్రమించినడ చుకొనుటకులేను, సకలభూమండలమునకు మండనభూతుం డగుశ్రీవేంకటకుమారమహీ పతిసూర్యారావుగారియొక్క గుఱ్ఱములగు మాకు మాపాదసంబంధమైనధూళిని మోయు వాయువు ననుసరించుట యనుచిత మనుబుద్ధిచేతను వలెను; మానశీలురు లోకంబున నీచుల ననుసరించుటయనుచితము; తే=నీయొక్క, అశ్వాః=గుఱ్ఱములు, జవ=వేగముచే, అధికాః= అధికమైనవి, స్యుః=కాఁగలవు, దీనిచే తురగసంపత్తి చెప్పంబడెను. వీరిప్రయాణస మయము ననుకూలవాయుప్రసరణము దోఁచుచున్నది.

శ్లో॥ సవిద్యుద్గర్జితం మేఘ, మనుకుర్వన్తు తే రథాః
చక్రభ్రమణరుద్ధ్వాన్తైస్సముజ్ఝన్తః కుమార! తే. ౨౬.

గీ॥ స్వారిభ్రమణస్ఫురణపి
ఘారావసమంచితంబు • లవునీరథముల్
నీరదము పాదిరాభి
ఖ్యారసితము ననుకరించుఁగాతఁ గుమారా! ౨౬.

వ్యా॥ సవిద్యుదితి. హేకుమార! త్వస్య అరీణిచక్రాణి తేషాం యద్భ్రమణం తేన యారుచః=యేధ్వాన్తాశ్చ తైః స్సముజ్ఝన్తః, తే ప్రసిద్ధాః తే=తవరథాః విద్యు తశ్చ గర్జితానిచ తైః సహితం మేఘం అనుకుర్వంతు=సదృశీకుర్వంతు, యద్వా పశ్చా త్కుర్వన్తు, తిరస్కుర్వం త్విత్యర్థః. అనేనాస్యరథసమ్పత్తిరుక్తా. బింబప్రతిబింబ భావేనేయముపమా.

టీ॥ కుమార=ఓరాజకుమారా! చక్ర=రథచక్రములయొక్క, భ్రమణ=తిరు గుటచేతనైన, రుద్ధ్వాన్తైః=కాంతులతోను ధ్వనులతోను, సముంచంతః=బాగుగ నొప్ప

చున్న, తే=ప్రసిద్ధములైన తే=నీయొక్క, రథాః=రథములు, తటిద్యోతద్రక్షితం = మెఱుపుల తోసుఱుములతోఁగూడిన, మేఘం=మేఘమును, అనుకుర్వంతు=సమానము చేసికొనుచుం గాక, లేక తిరస్కరించుఁగాక ; బింబప్రతిబింబోపమాలంకారము ; ఇందు రథసంపత్తి చెప్పంబడెను.

శ్లో. త్రస్యచ్ఛకున్తవత్కున్తం, చతుర్భూషావిభూషితమ్
పాదాత మభితో యాతు, పూర్విహారే కుమార! తే. ౨౬.

గీ. త్రస్యదుద్యచ్ఛకుంతకుంతములఁ దాల్చి
నాల్గు దెఱఁగులఁ దగుభూషణములఁ జెలువు
గాంచుపాదాత మేతెంచుఁగాత నీదు
మోసలను బట్టనవిహారమునఁ గుమార! ౨౬.

వ్యా. త్రస్యదితి. హే కుమార! త్రస్యన్తో యే శకున్తాః పక్షివిశేషాః తఏషాం సన్తీతి తథోక్తాః, కున్తాః=శస్త్రవిశేషాః యస్య తత్తథోక్తం, చతసృభి రావేధ్యా రోప్యవిక్షేప్యబన్ధనీయాభి ర్భూషాభిః యద్వా కచధార్య దేహధార్య పరిధాన విశేషనైర్వా విశేషేణభూషితం, పాదాతం=పదబృన్దం, తే=తవ పూర్విహారే=పురవిహారే, అభితః=సర్వత్ర యాతు. అనేన పాదాతసమ్పత్తి రుక్తా. అత్ర పూర్విహార ఇత్యుక్త్యా చైత్రయాత్రాయాం త్వనేకసామన్త మన్త్రిమిత్రసేనాధ్యక్షాదిసహితస్యాస్య సేనా సముదయ ఈదృశ ఇతి వక్తు మశక్యమేవేతి గమ్యతే. స్వభావోక్తిరలఙ్కారః.

టీ. కుమార=ఓరాజకుమారా! త్రస్యత్=భయపడుచున్న, శకుంతవత్=పక్షులు కలిగినట్టి, కుంతం=ఈఁటెలుగలిగినట్టియు, చతుః=నాలుగైన ఆవేధ్యము, ఆరోప్యము, విక్షేపము, బంధనీయము, అని; కుండలములు మొదలగుకర్ణభూషణములు ఆవేధ్యములు, కిరీటము మొదలగుశిరోభూషణములు ఆరోప్యములు, హారములు మొదలగునవి విక్షేపములు, భుజకీర్తులు మొదలగు బాహుభూషణములు బంధనీయములు, అని భూషణములు నాలుగు దెఱంగులు. ఇట్టిభూషణములచే విభూషితం=విశేషముగా నలంకరింపఁబడిన పాదాతం=కాల్బలము. తే=నీయొక్క అభితః=నాలుగు వైపులను, పూర్విహారే=పురవిహారమందు, యాతు=నడచుఁగాక. ఇచ్చటఁబూర్విహార మని చెప్పుటచే నీరాజకుమారుని

దండయాత్రలందు సామంతులు మంత్రులు మిత్రులు సేనానాయకులు మొదలైన వారితోఁగూడినసేనలు లెక్కించుట నలవిగాదనితోఁచుచున్నది. స్వభావోక్త్య లంకారము.

శ్లో. నీరాజయన్తు పూర్వధ్వస్సౌధస్థా శ్చన్ద్రదీపకైః
కుమార! త్వాం గజారూఢ, మిన్ద్ర మప్సరసో యథా. ౭౮.

కం. దంతిసమారూఢుని బుర
కాంతలు నినుఁ జంద్రదీపకంబుల నివ్వా
ళ్లింతురు సౌధగలై జం
భాంతకు నచ్చరవెలందులట్ల కుమారా! ౭౮.

వ్యా. నీరాజయ న్త్వితి. హేకుమార! పూర్వధ్వః=పురస్త్రియః, సౌధస్థా స్సత్యః, చన్ద్రదీపకైః=కర్పూరదీపకైః. ని. "ఘనసార శ్చన్ద్రసంజ్ఞ" ఇత్యమరః. అలాఙ్ఛేకః. గజారూఢం త్వాం అప్సరసః=స్వర్వేశ్యాః, గజారూఢమ్=ఐరావతారూఢ మిన్ద్ర మివ, నీరాజయన్తు=నీరాజితం కుర్వన్తు, సౌధస్థా ఇత్యనేన పురస్యాస్య మహాభాగ్యవత్త్వం అప్సరస్సామ్యా త్పురస్త్రీణాం లోకోత్తరసౌన్దర్యం పురన్దరసామ్యాచ్చాస్యచక్రవర్తిత్వం చ గమ్యతే. పూర్ణోపమోదాత్తాలఙ్కారయో రంశభేదేనసంసృష్టి స్సఙ్కరశ్చ.

టీ. కుమార=ఓరాజకుమారా! పూర్వధ్వః=పురస్త్రీలు, సౌధస్థాః=మేడలయందున్నవారై, గజారూఢం=గజారూఢుఁడవైన, త్వాం=నిన్ను, చంద్రదీపకైః=కర్పూరపుదీపములచే, అప్సరసః=అప్సరస్త్రీలు, గజారూఢం=ఐరావతారూఢుఁడైన, ఇంద్రమివ=ఇంద్రునివలె, నీరాజయంతు=నివాళింపఁజేసెదరు. ఇచ్చటమేడలయం దుండుస్త్రీలనిచెప్పటచేఁబట్టనము సకలైశ్వర్యములు గలదనియు నప్సరస్త్రీసామ్యముచేఁ బురస్త్రీలతిసుందరులనియుఁ దోఁచుచున్నది. ఇచటనంశభేదముచేఁ బూర్ణోపమోదాత్తాలంకారములకు సంసృష్టి సంకరము రెండునుగలవు.

శ్లో. భద్రాసనస్థం పశ్యన్త స్త్వాం సూర్య ముదయంగతమ్
ప్రబుద్ధాననపద్మాస్స్యుః కుమార! సకలాజనాః. ౭౯.

కం. నిను సకలజనులు భద్రా
సనసుసమాసీను నుదయ సంగతు సూర్యుం
గనుఁగొనుచు సంప్రహృష్టా
స్యనీరరుహులౌచు నుందు రయ్య కుమారా! ౨౯.

వ్యా. భద్రేతి. హేకుమార, సకలాజనాః=కలాభిః విద్యాభి స్సహితాః జనాః పణ్డితా ఇత్యర్థః. యద్వా సకలాజనాః=పామరా అపీ త్యర్థః, భద్రాసనస్థం=సింహాసనాసీనం, ఉదయమ్=అభ్యుదయం గతం, సూర్యం=సూర్యనామానం త్వాం, కర్మ్యుదయం గతం=పూర్వశైలం గతం, సూర్యమ్=ఆదిత్యం, యథాతథా పశ్యన్త స్సన్తః ప్రబుద్ధాని=హృష్టాని అన్యత్ర వికసితాని. ఆననాన్యేవ పద్మాని యేషాం తథోక్తాః స్యుః. శ్లేషోజ్జీవితపరిణామాలఙ్కారః.

టీ. కుమార=ఓ రాజకుమారా! సకలాః=పండితులైనట్టి, జనాః=జనులు లేక సకలజనులును, భద్రాసనస్థం=సింహాసనాసీనుఁడైనట్టియు, ఉదయంగతం=అభ్యుదయమును బొందునట్టి, సూర్యం=సూర్య నామముకలిగిన, త్వాం=నిన్ను, ఉదయంగతం=ఉదయపర్వతమును బొందినట్టి, సూర్యం=సూర్యునిఁగా, పశ్యంతః=చూచుచున్న వారై, ప్రబుద్ధ=సంతోషించినట్టియు, వికసించినట్టియు, ఆనన=ముఖముల నెడి, పద్మాః=పద్మములు గలవారు, స్యుః=కాఁగలరు. శ్లేషోజ్జీవితపరిణామాలంకారము.

శ్లో. యథా ధౌమ్యో ధర్మజనే, రామస్యాబ్జాత్మజో యథా
తే కుమారాభిషేకం భూసురాః కుర్వన్తు సిన్ధుకైః. ౩౦.

తే. ధర్మనందనునకు నల ధౌమ్యుఁ డట్ల
శ్రీరఘూద్వహునకును వసిష్ఠుఁ డట్ల
సింధుజలముల ద్విజులభి షేకవిధిని
నీకుఁ గావించెదరు గాత మో కుమార! ౩౦.

వ్యా. యథేతి. హేకుమార! భూసురాః=విప్రాః, ధర్మజనేః=ధర్మరాజస్య యథా ధౌమ్యః, రామస్య యథా, అబ్జాత్మజః=వసిష్ఠః, సిన్ధుకైః=సముద్రనదీనదజలైః కరణైః తే=తవాభిషేకం కుర్వన్తు. అత్రకుమారస్య రామయుధిష్ఠిరాభ్యాం సాదృశ్యప్రతి

పాదేన పూర్వం రాజ్యభఙ్గః పరతో రాజ్యలాభో మహాభాగ్యవత్త్వం చ సూచ్యతే, ధౌమ్యవసిష్ఠసామ్యేన తత్సన్నిధానస్థభూసురాణాం మహామహిమత్వం గమ్యతే, పూర్ణోపమాలఙ్కారః.

టీ. కుమార=ఓ రాజకుమారా, భూసురాః=విప్రులు, ధర్మజస్య=ధర్మరాజునకు, యథా ధౌమ్యః=ధౌమ్యునివలెను, రామస్య=రామునకు, అజాత్మజో యథా=వసిష్ఠమహాముని వలెను, సిన్ధుకైః=సముద్రనదీనదజలములచే, తే=నీయొక్క అభిషేకం=పట్టాభిషేకమును, కుర్వంతు=చేసెదరుగాక; ఈశ్లోకంబున రామయుధిష్ఠరసామ్యముచే నీరాజకుమారునకుఁ బూర్వము రాజ్యభంగము గలిగి పిమ్మట రాజ్యలాభమును మహాభాగ్యవత్త్వమును ధౌమ్యవసిష్ఠసామ్యముచే మహామహిమ గల బ్రాహ్మణసన్నిధానమును సూచించుచున్నది. పూర్ణోపమాలంకారము.

శ్లో. పుణ్డరీకం శ్రియస్స్థానం, పుణ్డరీకీకృతం కిము
యతః కుమార! దృగ్భృఙ్గప్రవేశాస్స్యు ర్నిరన్తరాః. ౩౧.

తే. పుండరీకీకృతంబయి పొదలు నేమొ
శ్రీనికేతన మగుపుండరీక మేమి
కతమునఁ గుమార! దృష్టిభృంగప్రవేశ
ములు నిరంతరములుగాఁగఁ బొదలుచుండు. ౩౧.

వ్యా. పుణ్డరీకమితి. శ్రియః=శోభాయాః, స్థానం, రాజ్యలక్ష్మ్యాః స్థానమితిచ వివక్షిత శ్వేతచ్ఛత్రతా దార్ఢ్యసంభావనాऽను రోధాత్=ఏతాదృశం పుణ్డరీకం=సిత పద్మం పుణ్డరీకం=శ్వేతాతపత్రం కృతం కిము, ఇత్యుత్ప్రేక్షా ని. ‘‘పుణ్డరీకం సితామ్భోజే శ్వేతచ్ఛత్రే’’ త్యమరః. యతఃకారణాత్ దృశ ఏవ భృఙ్గాః తేషాంప్రవేశాః నిరన్తరాః = నిరవకాశాః స్యు రితి పూర్వేణసమ్బన్ధః. శ్లేషోత్ప్రేక్షారూపకచ్ఛేకానుప్రాసానాం యథాయథంసంకరస్సంసృష్టిశ్చ.

టీ. కుమార=ఓ రాజకుమారకా! శ్రియః=శోభకు, స్థానం=స్థానమైనట్టి, పుండరీకం=తెల్లదామర లేక శ్రియః=లక్ష్మీదేవికి, స్థానం=స్థానమైనట్టి, పుండరీకం=శ్వేతాతపత్రమై, కృతం కిము=చేయఁబడినదా యేమి, యతః=ఏ కారణమున, దృశః=చూపులనెడి, భృంగ=తుమ్మెదలయొక్క, ప్రవేశాః=ప్రవేశములు నిరంతరాః=అవకాశములులే

నివి, స్యుః=కాఁగలవు. శ్లేషోత్ప్రేక్షారూపకచ్ఛేకాను ప్రాసములకు సంకరము సంసృష్టి.

శ్లో. ద్విధాభూత్వా శశీ వాలవ్యజనచ్ఛలతో భజేత్
కుమార! త్వాం లాలసయా, యత స్త్వం భూమహేశ్వరః. 32.

కం. భజియింపఁగాఁ దలఁచి వాల
వ్యజనవ్యాజమున నిన్ను • ద్వైవిధీభావం
బు జనింపఁగఁ జంద్రుఁడు నీ
వ జగత్పరమేశ్వరుండ•వగుటఁ గుమారా! 32.

వ్యా. ద్విధేతి. హేకుమార! శశీ=చన్ద్రః, వాలవ్యజనం=చామరం, తస్య ఛలతః=మిషేణ. ద్విధా=ద్విప్రకారః, భూత్వా, లాలసయా=అతికామనయా, త్వాం భజేత్; యతః=యస్మాత్కారణాత్, త్వం, భూమహేశ్వరః=భూమేఃమహారాజః, భూశివశ్చ, తత ఇత్యధ్యాహార్యం. శివరూపస్యాస్య సేవార్థం ద్విప్రకారత్వం శశినః సన్తోషాతిశయేనేతి బోద్ధవ్యం. అత్రాపహ్నవాలఙ్కారః "నిషిద్ధవిషయం సామ్యాదన్యారోపేప్యపహ్నవ" ఇతి.

టీ. కుమార=ఓరాజకుమారక! శశి=చంద్రుఁడు, వాలవ్యజనచ్ఛలతః=చామరములను మిషముచే, త్వాం=నిన్ను, భజేత్=సేవించుటగాక, యతః=ఏకారణమున, త్వం=నీవు, భూమహేశ్వరః=భూమికి మహారాజవో, లేక భూలోకమం దుండుశివుఁడవో యాకారణమున నని తెలియఁదగినది. శివరూపుఁ డగునీరాజకుమారుని సేవించునిమిత్తము చంద్రుఁడు రెండురూపములు ధరించుట సంతోషాతిశయముననని యెఱుంగునది. అపహ్నవాలంకారము.

శ్లో. వన్దిమాగధసన్దోహ,జయ స్తవరవాధికైః
విప్రాశీర్భిన్నదైర్ద స్తే స్తు, కుమార! జయమఙ్గళమ్. 33.

తే. వందితతులయు మాగధ•ప్రతతులయును
జయనుతిధ్వానముల నెక్కు•వయినయట్టి

క్షితిసురాశీరవంబులచేత నీకు

సమరుఁగావుత జయమంగళము కుమార! 33.

వ్యా. వన్దీతి. హేకుమార! వన్దినః=స్తుతిపాఠకాః, మాగధాః=వంశచారిత్రపాఠకాః, తేషాం సన్దోహః=సమూహః తేనకృతో జయస్తవః తస్యరవాదపిఅధికైః విప్రాణాం ఆశీర్విసర్గైః=ఆశీర్వాదధ్వానైః, తే=తుభ్యం, జయరూపమఙ్గళం, అస్తు. అత్రోజో నామ గుణః. "ఓజః స్సమాసభూయస్త్వ" మితిచతల్లక్షణమ్.

టీ. కుమార=ఓరాజకుమారా! వంది=స్తోత్రపాఠకులయొక్కయు, మాగధ=వంశచరిత్రపాఠకులయొక్కయు, సందోహ=సమూహము చేఁజేయఁబడిన, జయ=జయసంబంధమైన, స్తవ=స్తోత్రముయొక్క, రవ=ధ్వనికంటె, అధికైః=అధికములైన, విప్ర=బ్రాహ్మణులయొక్క, ఆశీర్విసర్గైః=ఆశీర్వాదధ్వనులచే, తే=నీకొఱకు, జయ=జయరూపమైన, మంగళం=శుభము, అస్తు=అగుఁగాక.

శ్లో. గజవాజిరథ న్నిష్కాన్, రత్నాని వివిధానృపాః

ఉపాయనాని కుర్వన్తు, కుమార! త్వద్వశీకృతాః. 3౪.

గీ. బహువిధనృపాలకులు నీకు వశగులగుచు

తేరులిభములుహరులుదీనారములును

రత్నసందోహములు నుపగ్రాహ్యములుగ

నీకు నొసరించెదరుగాక యోకుమార! 3౪.

వ్యా. గజేతి. హేకుమార! వివిధాః=బహుప్రకారాః, నృపాః=హూణపారసీకాదయః క్షత్రియాదయశ్చ సార్వభౌమ సమ్రాణ్మణ్డలాధిప మహారాజ రాజగ్రామాధిపాశ్చ, త్వద్వశీకృతాః=త్వదధీనాస్సన్తః, గజవాజిరథం, నిష్కాన్=సౌవర్ణికాన్ రత్నాని చ, ఉపాయనాని=ఉపగ్రాహ్యాని, కుర్వన్తు, ఉదాత్తాలఙ్కారః.

టీ. కుమార=ఓరాజకుమారా! వివిధా=పలువిధములుగల, నృపాః=రాజులు, అనఁగా హూణులు పారసీకులు మొదలగువారును క్షత్రియాదులును, చక్రవర్తి, సమ్రాట్టు, మండలాధిపుఁడు, మహారాజు, రాజు, గ్రామాధిపతి, మొదలగువారును, త్వద్వశీకృతాః=నీకుస్వాధీనులై, గజవాజిరథం=ఏనుఁగులు గుఱ్ఱములు రథములను, నిష్కా=

వరహాలను, రత్నాని=రత్నములను, ఉపాయనాని=అప్పనములను, కుర్వన్తు=చేయుదురు గాక. ఉదాత్తాలంకారము.

శ్లో. చలత్కరపదాస్యాబ్జం, రణద్వలయహంసకమ్
స్యాత్కుమారాగ్రతో నాట్యే, వేశ్యాబృన్దం సరస్సమమ్. ౩౫.

గీ. లాస్యమందుఁ గుమార! చంలత్కరాంఘ్రి
వదనపంకేరుహము రణంద్వలయహంస
కం బయినవారవనితాకందంబకంబు
పరఁగునీమోసల సరోంవరసమంబు. ౩౫.

వ్యా. చల దితి. హేకుమార ! చలత్కరప దాస్యాబ్జమ్=కరాణాంపదానాం ఆస్యానాంచ సమాహారః అబ్జానీవ, కరపదాస్యాబ్జాని, చలన్తి తాని యస్యతథోక్తం, హంసకా ఇవవలయాస్తేరణంతో యస్య, యద్వా రణంతః పాదకటకా ఏవ హంసకా యస్యయద్వా రణన్తో వలయాకారాః హంసా యస్య; తాదృగ్వేశ్యాబృన్దం తేగ్రతః నాట్యే, సరసా=కమలాకరేణ తుల్యంస్యాత్. వేశ్యానాం సరస్సామ్యాత్ శృఙ్గారాదిరసవత్త్వంద్యోత్యతే. అత్ర వేశ్యాసఙ్గ్రహ స్తుపరబలవశీకరణార్థం విలాసార్థం చ, న తు భోగార్థం. “పశువేశ్యాభిగమనే ప్రాజాపత్యం చరే” దితిస్మృతేః. బిమ్బప్రతిబిమ్బభావేనేయ ముపమా. పూర్వార్థే యథాక్రమంసౌందర్యధావళ్యయో స్సామాన్యధర్మత్వంబోధ్యం. చలనరణనయో స్తథాత్వే సమాసాయోగాత్, నూ “ఉపమితం వ్యాఘ్రాదిభిస్సామాన్యాప్రయోగే” ఇతిసామాన్యాప్రయోగఏవ సమాసవిధానాత్.

టీ. కుమార=ఓ రాజకుమారకా! చలత్కరపదాస్యాబ్జం=చలించుచున్న, అబ్జములవంటి హస్తములు, పాదములు, ముఖములు గలిగినట్టియు, రణద్వలయహంసకం, రణత్ = ధ్వనిచేయుచున్న, హంసలవంటియందెలు కలిగినట్టి, వేశ్యాబృందం=వేశ్యాసమూహము, తే=నీయొక్క, అగ్రతః=ఎదుట, నాట్యే=నాట్యశాలమందు, సరస్సమం=కొలనితోసమానమైనది, స్యాత్=ఔఁగాక. వేశ్యాబృందమునకు సరస్సుతో సామ్యముఁజెప్పుట శృంగారాది రసములుకలది యని తెలియునిమిత్తము. వేశ్యలను జేరఁదీయుట శత్రువులను వంచించు నిమిత్తము విలాసము నిమిత్తముగాని భోగార్థము గాదు; వేశ్యాభోగమందుఁ బ్రాజాపత్యవ్రతమును జలుపవలయు నని స్మృతులందుఁ

చెప్పంబడెను. చలత్కరపదాస్యాబ్జం, రణద్వలయహంసకం, అనుచోటు, జలనము ధ్వనియు సామాన్య ధర్మములుకావు. అట్లైననుపమితి సమాసము రాదు, వ్యాకరణ సూత్రమువలన సామాన్య ధర్మాప్రయోగమునందే యుపమితి సమాసము విధింపఁబడినది. అందువలన సౌందర్యధావళ్యములను సామాన్యధర్మములనుగా నెంచవలయును. బింబప్రతి బింబ భావంబునసైన యుపమాలంకారము.

శ్లో. జ్ఞాతిసామన్తసన్మిత్ర, మాతృష్వస్రీయమాతులైః
కుమారానుకురుష్వ త్వం, సత్ఋక్షతారాగ్రహం విధుమ్. ౩౮.

గీ. జ్ఞాతిసామంతమిత్రసజ్జనసుధీశ్వ
రులను మాతృష్వసేయమాతులులఁ గలసి
యుండి యుడుతారకాగ్రహయుక్తుఁ డయిన
పూర్ణిమాచంద్రు ననుకరింపుము కుమార! ౩౮.

వ్యా. హేకుమార! జ్ఞాతిభిః=గోత్రజైః,=సామన్తైః=స్వవిషయవాసిభి ర్నృపైః, సద్భిః=సజ్జనైః,మిత్రైః, మాతృష్వస్రీయైః=మాతృభాగినేయై ర్మాతులైశ్చ యుక్తః రితిశేషః, త్వం ఋక్షాణి=జ్యోతీంషి,తారాః=అశ్విన్యాదయః, గ్రహాః=సూర్యాదయః తైః సహితం విధుం=చన్ద్రం,అనుకురుష్వ=సమానీకురుష్వ. బన్ధుసమృద్ధిమాన్ భవేరితి భావః.అత్రాపి బిమ్బప్రతిబిమ్బభావే నోపమా.

టీ. హేకుమార=ఓరాజనందనా! జ్ఞాతిసామంతసన్మిత్రమాతృష్వస్రీయమాతులైః,జ్ఞాతి=జ్ఞాతులతోను,సామంత=సామంతరాజులతోను, సత్=సజ్జనులతోను,మిత్ర=స్నేహితులతోను,మాతృష్వస్రీయ=పినతల్లి పెదతల్లి కుమారులతోను,మాతులైః=మేనమామలతోను,గూడినవాఁడవై,త్వం=నీవు,సఋక్షతారాగ్రహంవిధుం,ఋక్ష=నక్షత్రములతోను,తారా=అశ్విన్యాదులతోను,గ్రహ=సూర్యాదినవగ్రహములతోను గూడిన,విధుం=చంద్రుని,అనుకురుష్వ=సమానముచేసికొనుము. అనఁగా బంధుసమృద్ధిగలవాఁడవగు మని భావము. ఇచ్చట బింబప్రతిబింబభావముచే నైనయుపమాలంకారము.

శ్లో. అశ్మసంఘటనభ్రాజ (శ్రీమ), త్సౌధప్రాఙ్గణభూమయః
కుమార! తే దానజలైః, కరిణాం స్యుః ప్రపఙ్కిలాః. ౩౭.

తే. అశ్మసంఘట్టనాతిర•మ్యంబు లయిన
హర్మ్యచత్వరదేశంబు • లలరుఁగాత
మోకుమార! త్వదీయస•మున్న తేభ
దానజలపూరజంబాలి•తంబు లగుచు. ౩౭.

వ్యా. అశ్మేతి. హేకుమార, తే=త్వత్సమ్బన్ధిన్యః, అశ్మనాం=మణీనాం, సంఘట్టనేన, భ్రాజన్త్యః=ప్రకాశమానాః, సౌధానాం ప్రాఙ్గణేషు=చత్వరేషు, యా భూమయః తాః దానజలైః=విప్రహస్తనిషిక్తదానోదకై రిత్యర్థః; కరిణాం=గజానాం మదోదకైశ్చ ప్రకర్షేణ పఙ్కిలాః=కర్దమి తాస్సన్త్వి త్యర్థః. అత్రాత్యుక్త్యుదాత్తాలంకారాః. «అత్యుక్తిరద్భుతాతథ్యశౌర్యౌదార్యాదివర్ణనం, ఉదాత్తమృద్ధిశ్చరితం శ్లాఘ్యంచాన్యోపలక్షణ''మితితల్లక్షణాత్ శ్లేషో నామగుణశ్చ. «మిథస్సంశ్లిష్టపదతా శ్లేష ఇత్యభిధీయతే.»

టీ. కుమార=ఓరాజనందనా! తే=నీసంబంధమైన, అశ్మ=మణులయొక్క, సంఘట్టన=సమ్మర్దముచే, భ్రాజత్=ప్రకాశించుచున్న, సౌధ=మేడలయొక్క, ప్రాంగణ=వాకిళులయందలి, భూమయః=భూములు, దాన=షోడశమహాదానములచేనైన, జలైః=ఉదకములచే నసఁగా బ్రాహ్మణహస్తములయం దుంపఁబడినవి, కరిణాం=ఏనుఁగులయొక్క, దానజలైః=మదజలములచేతను, ప్రపంకిలాః=మిక్కిలిబురదయైనవి, స్యుః=కాఁగలవు, అత్యుక్త్యుదాత్తాలంకారములు.

శ్లో. దాతు స్తే కరజాం సిన్ధుం, నదీయాచకపాదజా
నానుకర్తు మలంస్యాద్ధి, కుమార! జనుషాఽవరా. ౩౮.

తే. దాత వైనట్టినీమహ• స్తమునఁ బొడమి
నట్టిదైనమహానది • యాచకాంఘ్రి
యందుఁబొడమినధుని జని • నవర యగుచు
ననుకరింపంగఁదగదు గం•గా కుమార! ౩౮.

వ్యా. దాతురితి. హేకుమార! యాచకస్య=బలివనీపకస్య భగవతః వామనస్య, పాదజా=పాదోద్భవా నదీ; దాతుః=దానశీలస్య తే, కరజాం=హస్తోద్భవాం, సిన్ధుం=నదీం, అనుకర్తుం నాలంస్యాత్=అసమర్థాస్యాత్ ఇత్యర్థః; హి=యస్మాత్కా

రణాత్, జనుషా=జన్మనా, అవరా=నీచా, తస్మాదిత్యర్థః. పరికరాలఙ్కారః. కావ్య లిఙ్గంవా.

టీ. కుమార = ఓరాజనందనా ! యాచక=యాచకుఁడైనవామనమూర్తియొక్క, పాదజా=పాదమువలనఁబుట్టిన, నదీ=నది, దాతుః=దాతవైన, తే=నీయొక్క, కరజాం=హస్తమువలనఁబుట్టిన, సింధుం=నదిని, అనుకర్తుం=సరిచేయుకొఱకు, నాలంస్యాత్=సమర్థమైనది కాదో, హి=ఏకారణమున, అవరా=నీచమైనదో యని వెనుకకన్వయము. పరికరాలంకారము, లేక కావ్యలింగము.

శ్లో. దధీచిర్వా శిబిర్వాయం, కర్ణోవా విక్రమార్యమా
ఇత్యాత్తసంశయో లోకః, కుమారౌదార్యత స్తవ. ౩౯.

తే. తావకం బైనయట్టియౌదార్యమరసి
యోకుమార! దధీచియో లేక శిబియొ
కాక కర్ణుఁడొ విక్రమార్కప్రభుండొ
యనుచు సందియమొందునీజనము లెల్ల. ౩౯.

వ్యా. దధీచి రితి. హేకుమార, దధీచి ర్వా ఉత శిబి ర్వా కర్ణో వా విక్రమార్యమా = విక్రమాదిత్యోవా, ఇతీత్థం లోకః=జనః ఆత్తః=స్వీకృతః, సంశయః= సందేహాయేన తథోక్త స్స్యాత్. సన్దేహాలఙ్కారః.

టీ. కుమార=ఓరాజనందనా ! తే=నీయొక్క, ఔదార్యతః=వితరణాతిశయమువలన, అయం=ఈనీవు, దధీచిర్వా=దధీచిమహామునివో, శిబిర్వా=శిబిచక్రవర్తివో, కర్ణోవా=కర్ణుఁడవో, విక్రమార్యమావా, విక్రమార్కుఁడవో, ఇతి=ఈప్రకారముగ, లోకః=జనము, ఆత్త=స్వీకరింపఁబడిన, సంశయః=సందేహముగలది, స్యాత్=అగును. సందేహాలంకారము.

శ్లో. అహో త్వయా నామగుణే, న నకారస్య దీర్ఘతా
స్తే త్యస్యే త్వం చ లిఖితం, కుమారాన్యదితః కిము. ౪౦.

తే. ఔర! నీచేత నక్షరాభ్యసనమున 'న'
కారమున దీర్ఘముంచి 'స్తే' కారమునకు

గుడియు లిఖియింపఁబడదయ్యెఁ గడఁగి మఱియు
నొక్క టిఁకనేమి చెప్పుదు మో కుమార! ౪౦.

వ్యా. అహోఇతి. హేకుమార! త్వయా, నామగుణే=నామ్నామభ్యాసనసమయే, నకారస్య దీర్ఘతాచ, స్త ఇత్యస్యఇత్వం చ నలిఖితం; బాల్యే వయస్యపి విద్యాభ్యాసన సమయే త్వయా నాస్తి పదం న లిఖిత మిత్యర్థః. ఇతః ఏతస్మా దన్యత్ =ఇతర త్కిము వక్తవ్యం, త్వం సర్వదా నాస్తిపదవిముఖస్స న్నర్థినాం మనోరథాన్ సఫలయిష్యసీ తిభావః. అత్రపర్యాయోక్తమలఙ్కారః. అతిశయోక్తిశ్చ "పర్యాయోక్తంతుగమ్యస్యవచో భఙ్గ్యంతరాశ్రయం," "యోగేప్యయోగో౽సంబంధాతిశయోక్తిరితీష్యతే" ఇతి తల్లక్షణాత్.

టీ. కుమార=ఓరాజనందనా! త్వయా=నీచేతను, నామగుణే=వర్ణక్రమము చెప్పఁబడు సమయమున, నకారస్య=నకారమునకు, దీర్ఘతా=దీర్ఘమును, స్తేత్యస్య="స్త" యను దానికి, ఇత్వంచ,=ఇకారమును, నలిఖితం=వ్రాయఁబడలేదు. ఇతః = ఇంతకంటె, అన్యత్=మఱియొకటి, కిము=ఏమికలదు, బాల్యమునను నీవు పేరులువ్రాయుసమయంబునను నాస్తియని వ్రాయక యాచకులయొక్క మనోరథములను నిండింపఁజేయుచుందు వనియభిప్రాయము.

శ్లో. అద్యప్రభృతి తే వృద్ధి, శ్శుక్లపక్షవిధో రివ
స్యాత్కుమార! కళాపూర్ణ, స్సదానన్దకరో భవ. ౪౧.

తే. నేఁడు మొదలుగ నభివృద్ధి నీకు శుక్ల
పక్షమందున విధునికిం బలెను గల్గుఁ
గాన నింకఁ గళాపూర్ణ తానిరూఢి
గాంచినీవుసదానంద కరుఁడ వగుము. ౪౧

వ్యా. అద్య ఇతి. హేకుమార=అద్యప్రభృతి=ఏతత్కాలాదారభ్య తే=తవ వృద్ధిః=అభ్యుదయః, శుక్లపక్షవిధోరివ=సితపక్షచన్ద్రస్యేవస్యాత్; త్వం కలాభిః కాన్తిభిః, పూర్ణస్సన్ సదా=సర్వకాలేష్వానన్దకరః భవ, ద్రష్టౄణా మితి శేషః, అత్ర వృద్ధావేవచన్ద్రసామ్యం నతు క్షయే శుక్లపక్షేతి చన్ద్రవిశేషణాత్.

యద్వా, కలాభిశ్చతుష్షష్టివిద్యాభిః షోడశకలాభిశ్చ పూర్ణః సతాం=విదుషాం నక్షత్రాణాం చ, ఆనన్దకరః భవ నక్షత్రాణాం చన్ద్ర ఇవ విదుషామానన్దకరో భవేత్యర్థః.

యద్వా, శుక్లపక్ష విధుః=హంసరూపవిష్ణుః తస్యవృద్ధిరివవృద్ధిస్స్యాత్తే,హంసరూపేణ భగవా నవతీర్ణః సాధ్యానాం జ్ఞానముపదిష్టవా నితి శ్రీమహాభారతాదిషు ప్రసిద్ధం. తద్వత్కలాపూర్ణః=అధ్యాత్మవిద్యాపూర్ణః, సతాం=సజ్జనానాం ఆనన్దకరోభవేత్యర్థః.

యద్వా,కలేన=శుక్లేన,అపూర్ణః=పరిపూర్ణయౌవనఇత్యర్థః,అస్య=అంతఃపురస్య, తత్రత్య స్త్రీణామిత్యర్థః.ఆనన్దకరో భవేత్యర్థః. సవర్ణదీర్ఘః. ని. "అకారోబ్రహ్మవిష్ణ్వీశకమఠేష్వఙ్గణేరణే,గౌరవేన్తఃపుర" ఇతి నిఘంటుశ్చ.

యద్వా, కలయా=మూలధనవృద్ధ్యా, మూలధన మత్ర పీఠికాపురరాజ్యం, తద్వృద్ధ్యా=తద్ద్విగుణ్యేనేతియావత్. ని. "అంశమాత్రే మూలవృద్ధౌ, షష్ఠమావిద్యయో స్తథా, తత్తదాగమసిద్ధాసు గుహిణిస్త్రీరజస్యపి. కలం శుక్లే వాచ్యలిఙ్గమవ్యక్తమధురేధ్వనా"వితి. కోశాత్. తయా అపూర్ణః=ఈషత్పూర్ణః నపర్యాప్తబుద్ధిశ్చార్యా. "అసన్తుష్టా ద్విజా నష్టా స్సన్తుష్టా ఇవ పార్థివాః, సలజ్జా గణికా నష్టా నిర్లజ్జేవ కులాఙ్గనా" ఇత్యుక్తత్వాదిత్యర్థః.

యద్వా, సతః ఆనన్దయన్తీతి సదానన్దాః కరాః=బలయః యస్య తథోక్తః యథోచితకరగ్రాహీభవేతి భావః. అర్థపారుష్యస్య మనునా నిషిద్ధత్వాత్. అత్ర మఙ్గళాదీని మఙ్గళమధ్యాని మఙ్గళాన్తాని కావ్యాని వీరపురుషాణి ప్రథన్త ఇతి భాష్యకారవచనప్రామాణ్యేన ప్రాధాన్యేన చతుర్విధపురుషార్థసిద్ధికృదాశీర్వచోరూపమఙ్గళం కావ్యమధ్యే కృత మితిజ్ఞేయం. శ్లేషాలఙ్కారః.

టీ. కుమార=ఓరాజనందనా! అద్యప్రభృతి=ఇదిమొదలుకొని, తే=నీయొక్క, వృద్ధిః=అభివృద్ధి,శుక్లపక్ష విధోరివ=శుక్లపక్షచంద్రునివలె,స్యాత్=కాఁగలదు, త్వం=నీవు, కలాపూర్ణః=కాంతులతో నిండినవాఁడవై,సదా=సర్వకాలములయందు, ఆనందకరః=ఆనందముచేయువాఁడవు,భవ=అగుము. ఈశ్లోకంబున శుక్లపక్షచంద్రుఁడని చెప్పుటచే వర్ధమానచంద్రునితో సామ్యముగాని క్షీణచంద్రునితోఁగాదనుట

మఱియు, కలాభిః=చతుష్షష్టివిద్యలచేతను షోడశకళలచేతను, పూర్ణః=నిండిన వాఁడవై, సతాం=విద్వాంసులకును, నక్షత్రములకును, ఆనందకరః=సంతోషమును జేయు వాఁడవు, అగుమా.

మఱియు, శుక్లపక్షవిశోరివ=హంసరూపుఁడగు విష్ణువవలె, భగవంతుం డగు శ్రీహరి హంసరూపమున నవతరించి సాధ్యులకు జ్ఞానముపదేశించెనని భారతమందు వక్కాణింపఁబడెను. కలాపూర్ణః=అధ్యాత్మవిద్యలచేఁబూర్ణుఁడవై, సదానందకరః=సజ్జనులకానంద ముఁజేయువాఁడవు, భవ=అగుమా.

మఱియు, కలాపూర్ణః=శుక్లముతోఁబరిపూర్ణుఁడవై, యనఁగాఁ బూర్ణయావనముగలవాఁడవై, అస్య=అంతఃపురమునకు, అనఁగానంతఃపురస్త్రీలకు, ఆనందకరః=ఆనందమును జేయువాఁడవు, భవ=అగుమా.

మఱియు, కలా=మూలధనవృద్ధిచే, మూలధనమనఁబీకి కాపురసంస్థానముదానియొక్క వృద్ధిచే, అపూర్ణః=కొంచెముపూర్ణుఁడవై యింతియచాలు నని రాజులు సంతోషింపఁ గూడదు. సంతోషించినరాజులు, సంతోషింపని బ్రాహ్మణులువలెను, లజ్జగలవేశ్య లజ్జ లేనికులాంగనవలెను నశించెద రనిస్మృతివచనము.

మఱియు, సదానందకరః, సత్=సత్పురుషులకు, ఆనంద=ఆనందమును జేయు, కరః=పన్నులు గలవాఁడవు, అనఁగాఁ దగినపన్నులుబుచ్చుకొనువాఁడవగుమాయనిభావము, అర్థపారుష్యము గూడదని మనువుచే నిషేధింపఁబడెను; ఆదియందు మధ్యమమందు నంతమందు మంగళములు గలవియు వీరపురుషచరితములైనట్టియుఁ గావ్యములు ప్రసిద్ధిఁజెందునను భాష్యకారవచనప్రామాణ్యమునుంబట్టి కావ్యమధ్యఁబునఁ బురుషార్థచతుష్టయసాధక మగుమంగళము ప్రాధాన్యముగాఁ జెప్పఁబడెను. శ్లేషాలంకారము.

శ్లో. రఞ్జనాద్భవ రాజాత్వం, లోకానాం రక్షణా ద్విధుః
కుమార! నైస్వర్గనై ర్వ్యక్త, శ్చిరం జైవాతృకో భవ. ౪౨.

తే. లోకములరంజనంబున నో కుమార!
రాజ వగు మీవు విధుఁడవు రక్షణమునఁ
దడవుగాఁగను జైవాతృకుఁడవు నగుము
స్వాత్మజనతాసమేతుండ వగుచు నెలమి. ౪౨.

వ్యా. రఞ్జనేతి. హేకుమార! లోకానాం=జనానాం రఞ్జనా త్త్వం రాజే త్యన్వర్థనామా భవ; చన్ద్రపక్షే రాజనామా భవ,రక్షణా ద్విధుః=విష్ణుసదృశః భవ, అన్యత్ర విధునామా భవ; స్వైర్బన్ధుమిత్రసామన్తాదిభి ర్యుక్తస్సన్ చిరం=చిరకాలం జైవాతృకః=ఆయుష్మాన్ భవ,అన్యత్ర స్వైర్ద్విజై ర్బ్రాహ్మణై ర్యుక్తస్సన్ ·"ద్విజరాజ శ్శశధర"ఇత్యమరకోశాత్ చన్ద్రస్య బ్రాహ్మణయుక్తత్వం చిరం,జైవాతృకనామా భవ అత్ర చన్ద్రకుమారయో రుపమాలఙ్కారధ్వనిః,శ్లేషేణ ప్రకృతాప్రకృతయో రభేదే నాధ్యవసాయా చ్ఛ్లేషమూలాతిశయోక్తిః.

టీ. కుమారా=ఓరాజకుమారా! లోకానాం=జనులను,రంజనాత్=రంజించుటవలన, రాజా=రాజు అనిసార్థకనామముగలవాఁడవు. చంద్రపక్షమున, రాజనామము గలవాఁడవనియు,రక్షణాత్=రక్షించుటవలన,విధుః=విష్ణుసదృశుఁడవు,భవ=అగుము,చంద్రపక్షమునవిధునామముగలవాఁడవనియు,స్వైః=నీసంబంధమగుబంధులుమిత్రులుసామంతులు మొదలగుజనులతో, యుక్తః=కూడినవాఁడవై, చిరం=చిరకాలము, జైవాతృకః=ఆయుర్దాయముగలవాఁడవు,భవ=అవుము,చంద్రపక్షమున స్వైర్ద్విజైః=స్వకీయులగుబ్రాహ్మణులతో,యుక్తః=కూడినవాఁడవై,చిరం, చిరకాలము; జైవాతృకః=జైవాతృకనామముగలవాఁడవనియు,నగుము యని సర్వత్రసంబంధము. ఉపమాధ్వనియు శ్లేషమూలాతిశయోక్త్యలంకారమును.

శ్లో. భూత్వా కలానిధి స్సత్సు,సోమో భూత్వాచ శత్రుషు
మిత్రేషు చన్ద్రమా భూత్వా, కుమార! జయ సర్వదా. ౪౩.

తే. నిచ్చ సత్తతియెడఁ గళానిధితఁబూని
మార్తురందెల్ల నెపుడు సోమత్వమూని
రమణ మిత్రములందుఁ జంద్రముఁడ వగుచు
ననిశ ముత్కర్షమును జెందుమా కుమార! ౪౩.

వ్యా. భూత్వేతి. హేకుమార! సత్సు=విద్వత్సు సత్పుత్రేషు చ, కలానాం=విద్యానాం షోడశకలానాం చ నిధిర్భూత్వా, శత్రుషు విషయే=అన్యత్ర తమఃశోకాదిషు సోమః=రుద్రః అన్యత్ర సోమనామకః భూత్వా మిత్రేషు విషయే=అన్యత్ర ద్వాదశాదిత్యేషు చన్ద్రస్య=ధనస్య మా=లక్ష్మీరూపః, యద్వా కర్పూరసమ్పత్తి ర్భూత్వా అన్యత్ర

చన్ద్రమానాయా చ అమృతదానేనాహ్లాదో భూత్వా. "చదిఆహ్లాదనే" ఇతిధాతుః. శ్రు. "ప్రథమాం పిబతే వహ్ని ర్ద్వితీయాం పిబతే రవి" రిత్యాదిస్మృతేః. సర్వదాసర్వోత్కర్షేణజయ. అత్రాపి శ్లేషమూలాతిశయోక్తిః.

టీ. కుమార=ఓరాజనందనా ! సత్సు=విద్వాంసులవిషయమందు, నక్షత్రముల విషయమందును, కలానిధిః=విద్యలకు నిధివి, షోడశకళలకు నిధియు, భూత్వా=అయి, శత్రుషు=శత్రువులవిషయమునఁ, జీఁకటిచక్రవాకములవిషయమునందును, సోమోభూత్వా=రుద్రుఁడవై, సోమనామకుఁడవై, మిత్రేషు=స్నేహితులవిషయమందు, ద్వాదశాదిత్యులవిషయమునను, చంద్రమాః=ధనసంపత్తిరూపమై, లేక కర్పూరసంపత్తివయ్యు, చంద్రనామకుఁడును, భూత్వా=అయి, సర్వదా, సర్వోత్కృష్టముగా, జయ=వర్తింపుమా. శ్లేషమూలాతిశయోక్త్యలంకారము.

శ్లో. చకోర్య ఇవ కోక్యస్స్వ, స్ఫురన్తౌ వీక్ష్యహర్షితాః
యశః ప్రతాపౌ చన్ద్రార్కౌ, తే కుమారైకదోత్థితౌ. ౪౪.

తే. ఒకర్మాలుగఁ జక్కఁగా నుద్గమించి
తేజరిలుచున్న నీదుకీర్తిప్రతాప
ములను చంద్రార్కులను జూచి మోదమంచఁ
గోకులుఁ జకోరులుం బలెనో కుమార ! ౪౪.

వ్యా. చకోర్య ఇతి. హేకుమార ! ఏమకదా=సకాలమేవ, ఉత్థితౌ=ఉదయంగతౌ, అన్యత్రోదయశైలంగతౌ, స్ఫురన్తౌ=దీప్తిమన్తౌ యశఃప్రతాపరూపౌ చన్ద్రార్కౌ వ్యస్తరూపమేతత్, వీక్ష్య చకోర్యః=చకోరాఙ్గనా ఇవ కోక్యః=కోకాఙ్గనాస్స్వ్యః అత్రాయమాశయః ఏవ చన్ద్రసూర్యయోరేకదోదయకాలిత్వం, నసర్వదా. కించచన్ద్రసద్భావకాలే సూర్యస్యాసద్భావః తథాచన్ద్రస్యాపి యశఃప్రతాపయోస్తుమైవం అనేనచకోరీ చక్రవాక్యోశ్చ యశఃప్రతాప రూపచంద్రార్కయోశ్చనాయికానాయకభావో వ్యజ్యతే తత్తల్లిఙ్గస్వారస్యాత్ ; యథా లోకే నూతనవరోత్కృష్టవరలాభే స్వైరిణీనాం హర్షౌత్సుక్యం తద్వదితి ధ్వనిః. భ్రాన్తిమత్తుల్యయోగితయోస్సఙ్కరః.

టీ కుమార=ఓరాజనందనా ! ఏకదా=ఒకకాలమందు, ఉద్ధితౌ=ఉదయించినట్టియు, ఉదయపర్వతమును బొందునట్టియు, స్ఫురంతౌ=ప్రకాశించుచున్నట్టి యశఃప్రతాపా

=కీర్తి ప్రతాపములరూపమైన చంద్రార్కౌ=చంద్రసూర్యులను, వీక్ష్య=చూచి, చకోర్య ఇవ=చకోరస్త్రీపక్షులవలె, కోక్యశ్చ=చక్రవాకస్త్రీపక్షులు, హర్షితాః=సంతోషించు నవి, న్యుః=కాఁగలవు ; లోకమునఁజంద్రసూర్యులకు నేకకాలమున నుదయించుట సంభవింపదు. ఈరాజకుమారునియొక్క యశఃప్రతాపములకు నెల్లపుడు నేకకాలమున నుదయము గలుగుచున్నది: ఇచ్చటఁ జకోరపక్షులకును జక్రవాకపక్షులకును యశఃప్రతాపములకును నాయికానాయక భావము ధ్వనించుచున్నది. ఆయాలింగసామ్యస్వము చేసని ; జారస్త్రీలకు నూతనవరలాభమున సంతోషాతిశయము సంభవించినటులయని ధ్వన్యర్థము.

శ్లో. త్రిశక్తిభి ర్నృపో భాతి, త్రిశక్తిభి రివేశ్వరః
తాభి ర్నిరన్తరో భూత్వా, కుమార! విజయీ భవ. ౪౫.

తే. ఈశ్వరుఁడు మూఁడుశక్తులఁ నెటుల యటుల
మూఁడుశక్తులచే రాజుఁపొలుపుగాంచు
వానిచే నీవు నెడలేనిఁవాఁడ వగుచు
నో కుమార! విశేషజయుండ వగుము. ౪౫.

వ్యా. త్రిశక్తిభి రితి. ఈశ్వరః త్రిశక్తిభిః=ఇచ్ఛా జ్ఞాన క్రియా శక్తిభి రివ,నృపః=త్రిశక్తిభిః ప్రభు మన్త్రోత్సాహ రూపాభి ర్భాతి, హేకుమార! తస్మాత్త్వమపి తాభిః పూర్వోక్తశక్తిభిః అవిచ్ఛేదసమ్బద్ధః, పరప్రవేశానవకాశ ఇత్యర్థః, భూత్వా విజయీభవ=విజయవాన్ భవ ; ఉపమావృత్త్యనుప్రాసశ్చ.

టీ. ఈశ్వరః=ఈశ్వరుఁడు,త్రిశక్తిభిరివ=ఇచ్ఛాజ్ఞానక్రియాశక్తులచేవలెనే,నృపః=రాజు,త్రిశక్తిభిః=ప్రభుమంత్రోత్సాహశక్తులచే,భాతి=ప్రకాశించుచున్నాఁడు,కుమార=ఓరాజనందనా! త్వమపి=నీవును, తాభిః =ఆప్రభుమంత్రోత్సాహశక్తులతో,నిరంతరః=ఎడతెగనిసంబంధముగలవాఁడవై, భూత్వా=అయి, విజయీ భవ=జయముకలవాఁడ వగుము. ఉపమావృత్త్యను ప్రాసాలంకారములు.

శ్లో. బుద్ధ్వా బలం స్వపరయోః, స్త్రివర్గం సంవిమృశ్య చ
ఇదం కర్తవ్య మిత్యర్థే, కుమార! భవ నిశ్చయీ. ౪౬.

క౦. విను నీబల మొరుబల మ
ర్థి నెఱి౦గి త్రివర్గ మేర్పఱి౦చియు నిది సే
యనగునది య౦చుఁ బనుల౦,
దనువుగఁ గృతనిశ్చయు౦డవగుము కుమారా. ౪౮.

వ్యా. బుద్ధ్వేతి. హేకుమార! స్వపరయోః = ఆత్మనః శత్రోశ్చ బల౦= సామర్థ్య౦,బుద్ధ్వా=జ్ఞాత్వా, యద్వా బల౦=సైన్య౦ వి. "స్థౌల్య సామర్థ్యసైన్యేషు బల" మిత్యమరః. త్రయాణా౦ క్షయస్థానవృద్ధీనా౦ వర్గ౦, విమృశ్య=ఆలోచ్య శత్రోరపేక్షయా స్వస్యహీనత్వ౦ క్షయః=స్థాన౦ సమత్వ౦,వృద్ధి రాధిక్య౦. వి. "క్షయస్థాన౦ చ వృద్ధిశ్చ త్రివర్గో నీతివేదినా" మిత్యమరః, యద్వా త్రయాణా౦ ధర్మార్థకామానా౦ వర్గ౦ విమృశ్య అర్థే=ప్రయోజనవిషయే, ఇద౦ కర్తవ్యమితి నిశ్చయీ=నిశ్చయవాన్ భవ. న కదాచి దపినిశ్చితార్థేషు ఫలవైపరీత్య మితిభావః.

టీ. కుమార,=ఓనృపనందనా! స్వ పరయోః=తనయొక్కయు శత్రువులయొక్కయు, బల౦=సామర్థ్యమును, లేక సైన్యమును, బుద్ధ్వా=తెలిసికొని, త్రివర్గ౦=క్షయ స్థానవృద్ధులను,లేక ధర్మార్థ కామములను, శత్రువులక౦టెఁ దానుదగ్గియు౦డుట క్షయ మనియు,శత్రువులతో సమముగా ను౦డుట స్థానమ నియు,నధికముగా ను౦డుట వృద్ధియ నియుఁ దెలియ౦దగినది. విమృశ్యచ=ఆలోచి౦చి, అర్థే=ప్రయోజనమువిషయమై ఇద౦కర్తవ్యమితి=ఇది సేయఁదగినదని, నిశ్చయీ=నిశ్చయజ్ఞానముగలవాఁడవు, భవ= అగుము. నిశ్చయి౦చిచేయుకార్యములు వైపరీత్యము నొ౦ద వని తాత్పర్యము.

శ్లో. పరేణ బలినా సన్ధిః, కర్తవ్యస్స్యా త్సమేన వా
హీనేన తు న కర్తవ్యః, కుమా రైశ్వర్య మిచ్ఛతా. ౪౯.

క౦. ఘనుఁడైనను సముఁడైనను
దనరిపుతోఁ బొత్తుసేయఁ దగు నైశ్వర్య౦
బునుగోరువానిచే న
ల్పునితో నటుసేయఁ దగునె బోసఁగుఁ గుమారా. ౪౯.

వ్యా. హేకుమార! ఐశ్వర్యమిచ్ఛతా=భాగ్యాభిలాషిణా త్వయా బలినా= సామర్థ్యవతా సైన్యవతా చ, పరేణ=శత్రుణా, సన్ధిః = సామదానాభ్యా౦ వ్యవస్థా

కర్తవ్యః, సమేన = స్వతుల్యశత్రుణా, వా=వికల్పేన సన్ధిః కర్తవ్యః, జయపరాజయయో స్సంశయాస్పదత్వా త్సైన్యా వా స్వల్పదానేన వాసన్ధిః కార్య ఇతిజ్ఞేయం. "నస్వల్పస్య కృతే భూరి, నాశయే న్మతిమాన్నరః, ఏతదేవాత్ర పాణ్డిత్యం యత్స్వల్పా ద్భూరిరక్షణ" మితి అనుద్ధతవిషయ మేతత్, ఉద్ధతశ్చేద్యుద్ధ మేవ కర్తవ్యం. "ఉపరుధ్యారిమాసీత, రాష్ట్రంచాస్యోపపీడయేత్, దూషయేచ్చాస్యసతతం, యవస్సాన్నోదకేంధన" మితి శుక్రబృహస్పతిభ్యాం ప్రతిపాదనాత్ హీనేన=బలహీనేన, శత్రుణా సన్ధిర్న కర్తవ్యః, సర్వత్ర సన్ధేః ప్రాధాన్యే కోశదణ్డరాజ్యవృద్ధి ప్రజారక్షణాదిర్నస్యాత్ శరణం గత శ్చే ద్రక్ష్య ఏవ. "బద్ధాఞ్జలిపుటందీనం, యాచన్తం శరణాగతమ్, నహన్యాదానృశంస్యార్థ మపిశత్రుం పరన్తప" ఇతిరామాయణేప్యుక్తం, తథాపి క్షత్రియస్య విజిత మితి న్యాయమనుసృత్య శత్రుసామర్థ్యానుసారేణ జనపద లాభః కోశలాభో వా తస్మాదధిగంతవ్యః.

టీ. కుమార=ఓరాజకుమారా ! ఐశ్వర్య మిచ్ఛతా=భాగ్యమునుగోరునట్టి, త్వయా=నీచేతను, బలినా=సామర్థ్యముగలిగినట్టి యు లేక సైన్యముగలిగినట్టియు, పరేణ=శత్రువుతో, సంధిః=సామదానములచే స్నేహము, కర్తవ్యః=చేయఁదగినది, సమేన=సమానునితో, వా=పక్షాంతరమున, సంధిః=సంధి, కర్తవ్యః=చేయఁదగినది, సమానులతో యుద్ధము చేసినయెడల జయాపజయములు నిశ్చయించుట శక్యముగానందున సంధినేచేయవలయు ; ఇదియు ననుద్ధతులవిషయముగాని యుద్ధతులవిషయముగా నేరదు. న్యాయ నుతప్పిసముఁడెత్తివచ్చునెడ, వానిరాజ్యము నరికట్టివానిరాజ్యాంగముల నాక్రమింప వలయు నని శుక్రబృహస్పతుల మతమై యున్నది. హీనేన=బలహీనునితో, సంధిః=సంధి, నకర్తవ్యః=చేయవలదు, ఎల్లెడల సామముపయోగించినచో రాజ్యధనప్రజాగంజనాదులవృద్ధిగానేరవు గాన యుద్ధతుల నాక్రమించి దీనుని శరణాగతుని రక్షింపవలయు, శరణాగతులఁ రక్షింపనియెడల ధర్మహాని యగునని రామాయణంబునఁ జెప్పంబడియె. అనఁగా రాజు జయులబ్ధం బగుధనమును గ్రహింపవలయు ననున్యాయము ననుసరించి శత్రుసామర్థ్యానుసారంబున దనజనపదాదిలాభంబుల నొందవలయునని తాత్పర్యము.

శ్లో. మాయూర ఇవ పక్షశ్రీః, ర్ధృత్వా కుటిలగా నరీన్
కుమార! కేకానిస్సాన్త్వైః, ప్రకృతీ రనురఞ్జయ. ౭౪.

ఆ.వె. అరుల జిహ్మగులను • హరియించి పక్షుల
క్ష్మీయుతుండ వగుచు•శిఖియుఁబోలె
నో కుమార! కనుము • కేకారవంబులఁ
బ్రకృతిమండలాను•రంజనంబు. ౪౭.

వ్యా. మయూర ఇతి. హే కుమార! త్వ మిత్యధ్యాహారః, మయూర ఇవ పక్షస్య=బలస్య శ్రీర్యస్య తథోక్తస్సన్ అన్యత్ర గరుత్సమృద్ధియుతస్సన్. ని. "పక్షః పార్శ్వగరుత్సాధ్య, సహాయబలభిత్తి" ష్వితి యాదవః; కుటిలగాన్=దుర్మార్గాన్, అన్యత్ర సర్పాన్, అరీన్=శత్రూన్ హృత్వా కేకా ఇవ నిస్వానాః అన్యత్ర కేకా ఇతి నిస్వానా శ్చ, తైః ప్రకృతీః=జనాన్ స్వామ్యమాత్యసుహృత్కోశరాష్ట్ర దుర్గబలాని చ. ని. "రాజ్యాఙ్గాని ప్రకృతయః పౌరాణాం శ్రేణయోపి చ" ఇత్యమరః. అనురఞ్జయేత్యన్వయః. ఉపమాలఙ్కారః.

టీ. కుమార=ఓ రాజకుమారా! త్వం=నీవు, మయూరఇవ=నెమిలివలె, పక్షశ్రీః=బలసమృద్ధిగలవాఁడవై, నెమిలిపక్షమున, ఱెక్కబలము గలఁగుట, కుటిలగాన్=దుర్మార్గులను, అరీన్=శత్రువులను, నెమిలిపక్షమున, వంకరగా నడిచెడుపాములను, హృత్వా=సంహరించి, కేకానిస్వానైః=నెమిలిధ్వనులవంటిధ్వనులచేతను, నెమిలిపక్షమునఁ గేకారావములచే, ప్రకృతీః=సామంతులు మంత్రులు స్నేహితులు ధనము దేశము కోటలు మొదలగు రాజ్యాంగములను, నెమిలిపక్షమునఁ బ్రజలను, అనురంజయ=రంజనసేయుము. ఉపమాలంకారము.

శ్లో. రిపో ర్ద్వయో స్తు కలహే, దైత్యదానవయో రివ
ఆలమ్బ్య పక్ష్మ మోపాయం, కుమార! త్వం సుఖీభవ. ౪౮.

గీ. దైత్యదానవులకుఁబోలెఁ • దద్విరోధు
లైనయిర్వురి కగుకల•హంబునందుఁ
బంచమం బైనయట్టియు•పాయ మీవు
గొని మహాసౌఖ్యశాలి వ•గుము కుమార! ౪౮.

వ్యా. రిపోరితి. హే కుమార! దైత్యదానవయో రివ బలవతో రితి శేషః, ద్వయోః రిపోః స్వవ్యతిరిక్తయో రిత్యర్థః, కలహే సతి పఞ్చమోపాయ ముపేక్షారూపమా

మ్న్య సుఖీ=సుఖవాన్ భవ. ఇదం శుక్రాచార్యమత మితి జ్ఞేయం, తు శబ్దేన ద్వయోః రిపోర్వా రేవ, అనయో రేకశ్శత్రు రపరోమిత్రంచే దయముపాయో న గ్రాహ్యః, అన్యథామిత్రహానిః "కృతార్థాహ్యకృతార్థానాం, మిత్రాణాం నభవన్తియే, తాన్మృతానపి క్రవ్యాదాః,కృతఘ్నా న్నోపభుఞ్జతే" ఇత్యుక్తత్వాత్పాతకంచస్యాత్.

టీ. కుమార=ఓరాజనందనా! దైత్యదానవయోరివ=రాక్షసులకు దేవతలకు వలె, ద్వయోః=ఇద్దఱగు,రిపోర్వః=శత్రువులకుఁ బరస్పరము,కలహే=కలహమందు,సంచమోపాయం=అయిదవదియగునుపేక్షరైనయుపాయమును, అలంబ్య=అవలంబించి, సుఖీ=సుఖవంతుఁడవు, భవ=అగుమూ, ఇది శుక్రాచార్యమత మని యెఱుంగునది. ఈశ్లోకంబున "తు" శబ్దముచే నిద్దఱునుశత్రువులైనయెడలనేకాని యొకఁడు మిత్రుఁడు మఱియొకఁడు శత్రువు నయినయెడల నుపేక్షించినచో మిత్రహానియు దోషమును గలుగుచున్నది. ఉపకారముచేసినమిత్రులకు నెవఁడాపత్కాలమున రక్షింపక యుపేక్షచేయునో యట్టికృతఘ్నునిపీనుఁగును నక్కలైనముట్టవని నీతివాక్యము చెప్పుచున్నది.

శ్లో. సమే సామాధికే దాన, మధమే దణ్డనం త్రిభిః
అశక్యే భేదమాహుస్త, త్కుమార! కుశలో భవ. ౫౦.

తే. అరి సరిగనున్న సామ మెచ్చైన దాన
మలఁతియైనను దండ మింట్లన్నిటికిని
మించ భేదంబు వచియింతు రెంచి కానఁ
గాంచుము కుమార! తదుపాయకౌశలంబు. ౫౦.

వ్యా. సమ ఇతి. హే కుమార! సమే అరౌ=శత్రౌవిషయే, సామ=సాన్త్వం, అధికే విషయే దానం, అధమే విషయే, దణ్డనం=దమం, త్రిభిరుపాయై రశక్యేవిషయే భేద ముపజాపమాహుః తస్మాత్త్వం కుశలో భవ ఉపాయే ష్వితిశేషః.

టీ. కుమార=ఓరాజకుమార! సమే=సముఁడగు, అరౌ=శత్రువువిషయమై, సామ=మంచిమాటలును, అధికే=అధికశత్రువిషయమై, దానం=దానమును, అధమే=అధమశత్రువువిషయమై,దమం=దండమును,త్రిభిః=ఈమూఁడుపాయములచే, అశక్యే=శక్య

మగానివానివిషయమై, భేదం=భేదమును, ఆహుః=చెప్పిరి. తత్ =ఆకారణమువలన, కుశలః=ఉపాయములందు నేర్పుగలవాఁడవు, భవ=అగుమా.

శ్లో. శత్రూం స్తన్మిత్రవర్గంచ, ద్వైధీకృత్య ప్రయత్నతః
కుమార! నిపుణై శ్చారై, శ్చక్షుష్మా న్భవ సర్వతః. ౫౧.

కం. ప్రతిపక్షుని కతనిహిత
ప్రతతికి జతనమున భేదభావము గల్పిం
చి తగంబ్రగల్భచారా
యతదృష్టుల నెందు నరయుమయ్యా కుమారా! ౫౧.

వ్యా. శత్రోరితి. హేకుమార! శత్రుం తస్యమిత్రవర్గంచ ప్రయత్నతః=భేదోపాయాత్, ద్వైధీకృత్య=పరస్పరవిరోధశాలినాకృత్వా, నిపుణైః=కుశలైః చారైః సర్వతః చక్షుష్మాన్=నేత్రవాన్ భవ. "రాజానశ్చారచక్షుషః" ఇతిస్మరణాత్.

టీ. కుమార=ఓరాజనందనా! శత్రుం=శత్రువును, తన్మిత్రవర్గంచ = ఆశత్రువుయొక్క హితసమూహమునకును, ప్రయత్నతః=భేదోపాయమువలన, ద్వైధీకృత్య=వేఱువేఱుచేసి, నిపుణైః=నేర్పరులగు, చారైః=చారులచేత, సర్వతః=అంతటను, చక్షుష్మాన్=నేత్రములుగలవాఁడవు, భవ=అగుమా ; చారులు రాజులకు నేత్రములవంటివారని రాజనీతి యందుఁ జెప్పంబడియెను.

శ్లో. ఉపకారప్రియం దక్షం, బలవన్మిత్ర మార్జయ
కుమార! సర్వలాభేభ్యో, మిత్రలబ్ధిర్వరా యతః. ౫౨.

గీ. పలువిధములైనయట్టిలాభములకంటె
మిత్రలాభంబె లెస్సయై మెఱయుఁ గాన
నుపకృతిప్రీతిదాక్ష్యబలోపచితుల
నొప్పుమిత్రంబు నార్జింపుమో కుమార! ౫౨.

వ్యా. ఉపకారేతి. హేకుమార! త్వ మిత్థభూతాహార్యం, ఉపకారః ప్రియః=ఇష్టో యస్య తత్ కృతజ్ఞమిత్యర్థః ; దక్షం=కార్యకరణసమర్థం బలవత్ బలం=సా

మర్థ్యం సైన్యం చ, తదస్తీతి తథోక్తం మిత్రం అర్జయ=సమ్పాదయ,సర్వలాభేభ్యః=భూహిరణ్యాదిలాభేభ్యః, మిత్రలబ్ధిః=మిత్రలాభః. యతః వరా; తత ఇతి పూర్వేణాన్వయః.

టీ. కుమార=ఓరాజకుమార! త్వం=నీవు, ఉపకారప్రియం=ఉపకారముసేయుటయం దిష్టుఁడైనట్టియు, దక్షం=సమర్థుఁడైనట్టియు, బలవత్=బలవంతుఁడైనట్టియు, మిత్రం=స్నేహితుని,అర్జయ=సంపాదింపుమా, సర్వలాభేభ్యః=భూహిరణ్యాదిసకలలాభములకంటె, మిత్రలబ్ధిః=మిత్రలాభము, యతః=ఏకారణమువలన, వరా=అధికమైనదో, ఆహేతువుచే నని పూర్వముతో సంబంధము.

శ్లో. అపఠక్షీణమాహు ర్యం, మన్త్రం నాన్యేవిదు ర్యథా
ప్రాగారమ్భాత్కుమార! త్వం, తంవ ర్తయతథావిధమ్. ౫౩.

గీ. తనరు నేమంత్ర మాఱునేత్రములఁ గలసి
తలపఁగారాని దనుపేరందాని నెటుల
కడఁగుటకు మున్న పరు లెఱుఁగంగరాని
యట్టిరీతిని రచియింపుమా కుమార! ౫౩.

వ్యా. అపఠితి. హేకుమార! యం మన్త్రం=గుప్తవాదం న విద్యతే షడక్షీణి యస్మిన్ తత్ ద్విపురుషకృత్య మాహుః, యం మన్త్రం ఆరమ్భాత్ప్రాక్ అన్యే=ఇతరే యథా న విదుఃతంమన్త్రం తథావిధంవరయ=నిర్వర్తయ.

టీ. కుమార=ఓరాజనందనా! యం మంత్రం=ఏరహస్యవాదమును,అషడక్షీణం=ఆఱునేత్రములులేనిదానినిగా అనఁగా ముగ్గురుజనులతో నాలోచింపఁగూడదనుట; ఆహుః=చెప్పుచున్నారో, యం=ఏరహస్యవాదమును, ఆరంభాత్=ప్రారంభముకంటె, ప్రాక్=ముందుగాను,అన్యే=ఇతరులు,యథా=ఏప్రకారమున,న విదుః=తెలియఁజాలరో, తంమంత్రం=ఆమంత్రమును, తథావిధం=అట్టివిధముగలదానినిగను, వర్తయ=చేయుమా; అనఁగా నిరువురికంటె నెక్కువమందితో నాలోచింపక చేసినయాలోచనము బహిఃప్రకాశమ్ముగాకుండునటులుకాపాడుచుఁగార్యములలెస్సగఁ జేయవలయునని భావము.

శ్లో. పటుం స్వరక్షోప్తార, మనురక్తం జనప్రియమ్
కురుష్వ మన్త్రిణం శాన్తం, కుమారోపధయా శుచిమ్. ౫౪.

కం. ఉపధాశుద్ధు జనప్రియు
నిపుణుని స్వచ్ఛిద్రగోప్తం నిశ్చలు ననుర
క్తిపరీతు శాంతునిఁ ని
ష్కపటునిఁ జేకొనుము మంత్రిఁగాఁగఁ గుమారా! ౫౪.

వ్యా. పటు మితి. హేకుమార! పటుం చతురం స్వేషాం రన్ధ్రాణాం=పరప్రవేశద్వారాణాం, గోప్తారం=రక్షకం, అనురక్తం=అనురాగిణం, జనానాం ప్రియం=ఇష్టం, శాన్తం=క్షమావన్తం, ఉపధయా=ధర్మాదిపరీక్షణేన, శుచిం=పరిశుద్ధం, పురుషం మన్త్రిణం కురుష్వ.

టీ. కుమార=ఓరాజనందనా! పటుం=నేర్పరియు, స్వరంధ్రగోప్తారం=తనఛిద్రములను గాపాడునట్టియు, అనురక్తం=అనురాగముగలిగినట్టియు, జనప్రియం=సర్వజనసమ్మతుఁడైనట్టియు, శాంతం=శాంతుఁడైనట్టియు, ఉపధయా=ధర్మాదిపరీక్షచే, శుచిం=పరిశుద్ధుఁడైనట్టిపురుషుని, మంత్రిణం=మంత్రినిఁగా, కురుష్వ=చేయుము.

శ్లో. చరాః కరా ఇవార్కస్య, చతురా స్సర్వదిక్చరాః
స్వేషాం పరేషాం చోదన్తాన్, బోధయన్తు కుమార! తే. ౫౫.

గీ. అర్కకరములకైవడిఁ నఖిలదిశల
వ్యాప్తిగాంచుచుఁ జతురులై యలరునీదు
చారు లాత్మీయపరకీయచరితములను
దెలుపుచుండుగాక నీకు నిచ్చలుఁ గుమార! ౫౫.

వ్యా. చరా ఇతి. హేకుమార! అర్కస్య=సూర్యస్య, కరాః=అంశవ ఇవ సర్వాసు దిక్షు చరన్తీతి తథోక్తాః, చతురాః=కుశలాః, స్వేషాం=స్వీయానాం, పరేషాం=ఇతరేషాం చ ఉదన్తాన్=వార్తాః, తే=తుభ్యం బోధయన్తు=నివేదయన్తు. అత్రోపమాలఙ్కారః.

టీ. కుమార=ఓరాజకుమారా! అర్కస్య=సూర్యునియొక్క, కరా ఇవ=కిరణములవలె, సర్వదిక్షు=సకలదిక్కులయందు, చరాః=సంచరించుచున్నట్టియు, చతురాః=కుశలులైనట్టియు, చరాః=చారులు, స్వేషాం=స్వబంధువులయొక్కయు, పరేషాంచ=శత్రువుల

యొక్కయు, ఉదంతాన్=వార్తలను, తే=నీకొఱకు, బోధయంతు=బోధముచేయుదురు గాక. ఉపమాలంకారము.

శ్లో. సామ్నా దానేన వైకేన, నలోక స్త్వద్వశేభవేత్
ఆభ్యాం ద్వాభ్యాం ఋజుభ్యాం త్వం, కుమార! జయసర్వతః.

కం. ఎన్నఁగ నొకసామంబునఁ
జెన్నగుదానమునఁ బ్రజ వశీకృతగామిం
దిన్నని యయ్యుభయముచే
నన్నియెడల జయమునొందుమయ్య కుమారా! ౫౬.

వ్యా. సామ్నేతి. హేకుమార! సామ్నా=సాన్త్వవచనేన, దానేన వా, ఏకేన=కేవలేన, లోకః=జనః, త్వద్వశే=త్వదధీనతాయాం నభవేత్ నతిష్ఠేత్ = అతః, ఋజుభ్యాం=సరళాభ్యాం, ఆభ్యాంద్వాభ్యాం=సామదానాభ్యాం, త్వం సర్వతః జయ=సర్వోత్కర్షేణ వర్తస్వ. వృత్త్యనుప్రాసః.

టీ. కుమార=ఓరాజనందనా! త్వం=నీవు, సామ్నా=సామవాక్యముచేనైన, దానేన వా=దానముచేనైన, ఏకేన=ఒకటిచే, లోకః=జనము, త్వద్వశీకృతః=నీస్వాధీనమైనది, న=కాదు, అతః=ఆకారణముచే, ఋజుభ్యాం=చక్కనైనట్టియు, ద్వాభ్యాం=రెండైనట్టియు, ఆభ్యాం=ఈసామదానములచే, సర్వతః=అంతటను, జయ=సర్వోత్కర్షచే వర్తింపుమా. వృత్త్యనుప్రాసము.

శ్లో. నమృదు ర్న చ తీక్ష్ణ స్త్వం, వసన్తార్యమవ త్కరైః
కుమార! జనచిత్తాబ్జ, పుష్టికృద్భవ కీర్తిమాన్. ౫౭.

గీ. కరముల వసంతకాలభాస్కరునికరణిఁ
గలుకుఁజూపక మెత్తనగాక జనుల
చిత్తపద్మంబులకుఁ బుష్టిసేయువాఁడ
వగుము నీవు లసత్కీర్తివై కుమార! ౫౭.

వ్యా. నేతి. హేకుమార! త్వం న మృదుః న తీక్ష్ణ శ్చ కింతు వసన్తార్యమవత్=మధ్యార్కవత్, కరైః=బలిభిః కిరణై శ్చ, జనస్య=లోకస్య, చిత్తాని=మనాంస్యేవ

అబ్జాని తేషాం పుష్టికృత్=పోషణకృత్సన్, కీర్తిమాన్ భవ=యశస్వీ భవ. అత్ర వస న్తసూర్యసామ్యా ద్యుక్తకరగ్రాహకత్వం గమ్యతే. ఉపమా రూపక శ్లేషాణాం సంసృష్టిః.

టీ. కుమార=రాజనందనా! త్వం=నీవు,న మృదుః=మృదువుకాని వాఁడవును, న తీక్ష్ణః=తీక్ష్ణము కాని వాఁడవును, భవ=అగుమా, కింతు=మఱేమనఁగా, వసంతార్యమవత్=వసంతసూర్యునిభంగిని, కరైః=పన్నులచేతను, కిరణములచేతను, జన=జనులయొక్క, చిత్తాబ్జాని=మనస్సులనెడి పద్మములను, పుష్టికృత్=పోషణచేయువాఁడవై, కీర్తిమాన్=కీర్తిమంతుఁడవు, భవ=అగుమా.

శ్లో. విశ్వస్తా న ప్యవిశ్వస్తాన్, విశ్వసే న్న చ విశ్వసేత్
స్వార్థసిద్ధ్యై నృపః పశ్యేత్, సూక్ష్మబుద్ధ్యా కుమార! తాన్.

కం. నమ్మికఁ జరియించిన మది
నమ్మక తిరిగినను జనుల • నరపతి దనకా
ర్యమ్మునకుఁ దెలిపి నరయుచు
నమ్మక నమ్మినటులుంట • నయము కుమారా!

వ్యా. విశ్వ స్తా నితి. హేకుమార! నృపః స్వార్థస్య=స్వప్రయోజనస్య, సిద్ధ్యై=కార్యనిష్పత్తయే, తాన్=వక్ష్యమాణాన్, సూక్ష్మబుద్ధ్యా=కుశాగ్రధియా, పశ్యేత్, విశ్వస్తాన్=విశ్వాసయోగ్యా నపి క్వచిత్సమయే నవిశ్వసేత్=విశ్వాసం న కుర్యాత్, అవిశ్వస్తాన్=విశ్వాసానర్హాం శ్చ విశ్వసేత్=విశ్వాసంకుర్యాత్, విశ్వస్తావిశ్వస్తా కార్యనిష్పత్తే రేవ జ్ఞాతవ్యా నాన్యథేతిభావః.

టీ. కుమార=ఓరాజనందనా, నృపః=రాజు, స్వార్థసిద్ధ్యై=స్వప్రయోజనసిద్ధికొఱకు, సూక్ష్మబుద్ధ్యా=కుశాగ్రబుద్ధిచే, తాన్=వారిని, పశ్యేత్=చూచుచు, విశ్వస్తానపి=విశ్వసింపఁదగినవారినైనను, నవిశ్వసేత్=విశ్వసింపఁగూడదు, అవిశ్వస్తాంశ్చ=విశ్వసింపఁదగనివారిని, విశ్వసేత్=విశ్వసింపవలయును; అనఁగా విశ్వాసావిశ్వాసములు కార్యసిద్ధులవలననే తెలియఁబడునని యభిప్రాయము.

శ్లో. గణా స్త్వయోపధా శుద్ధా, శ్శో త్తమాధమమధ్యమాః
త త్తత్ప్రదేషు సంస్థాప్యాః, కుమార! వినయాన్వితాః. ౫౯.

గీ. వినయపరులౌచు నుపధచే • విమలు లగుచు
నమరి యు త్తమమధ్యమా•ధము లనంగ
వెలయు నయ్యయి తెగలవా•రలను నీవు
త త్తదుద్యోగముల నిల్పఁ•దగుఁ గుమార! ౫౯.

వ్యా. గణా ఇతి. హేకుమార! త్వయా ఉపధయా=ధర్మాదిపరీక్షణేన, శుద్ధాః =పరీక్షితాశ్చ ని. "ఉపధాధర్మాద్యైర్యత్పరీక్షణ" మిత్యమరః. వినయేనాన్వితాశ్చ ఉత్తమాశ్చ మధ్యమా శ్చాధమాశ్చ గణాః=వ్యావహారికా, త త్తత్ప్రదేషు=త త్తదుద్యోగ స్థానేషు, సంస్థాప్యాః=స్థాపనీయాః, "ధర్మజ్ఞాన్=ధర్మకృత్యేషు, చార్థకృత్యేషు పణ్డితాన్ స్త్రీషు క్లీబా న్నియుంజీత నీచాన్ నీచేషు కర్మ" స్వితిమనువచనాత్.

టీ. కుమార=ఓరాజకుమారకా! త్వయా=నీచేతను, ఉపధా=ధర్మాదిపరీక్షచే తను, శుద్ధాః=పరిశుద్ధులైనట్టియు, వినయ=వినయముతో, అన్వితాః=కూడినట్టియు, ఉత్తమాధమమధ్యమాః=ఉత్తములు అధములు మధ్యములు నగు, గణాః=వ్యావహారికులు, త త్తత్ప్రదేషు=ఆయాతగినస్థానములయందు,సంస్థాప్యాః=నియోగింపఁదగినవారు.ధర్మకార్యములందు ధర్మజ్ఞులను, నర్థములయం దర్థజ్ఞులను, స్త్రీలయందు నపుంసకులను, నీచవుఁబనులయందు నీచులను నియోగింపవలయు నని మనువచనము.

శ్లో. న నీచ మధికం కుర్యా, న్నాధికం నీచ మప్యతః
యథార్హం స్థాపయే ద్రాజా, కుమార! స్వార్థతత్పరః. ౬౦.

కం. అధికునిఁగ నీచు చేయుట
యధికుని నీచునిఁగఁజేయు • టనుచిత మగు నం
చధిపతియథార్హ మగువిధి
నధికారమునందునిల్పఁ•నగును గుమారా! ౬౦.

వ్యా. నేతి. హేకుమార! స్వార్థే=స్వప్రయోజనే, తత్పరః=ఆసక్తః. ని "తత్పరేప్రసితాసక్తా" ఇత్యమరః. నీచం=నీచా స్త్రివిధాః,గుణనీచః కులనీచో వయో

నీచ శ్చేతి. తత్ర గుణనీచ స్సర్వతస్త్యాజ్య ఏవ; వయోనీచోపి తథైవ అస్పష్టగుణదోషత్వాత్; వయోనీచ ఇత్యనేన బాల్యం వివక్షితం. ఉక్తంచ. "గర్భస్థై స్సదృశో జ్ఞేయో అష్టమా ద్వత్సరా చ్ఛిశుః,బాల అషోడశా ద్వర్షా త్పౌగణ్డశ్చాపి శబ్ద్యతే పరతో వ్యవహారజ్ఞ స్స్వతన్త్రశ్చాపికథ్యత" ఇతి, తం అధికం=అధికపదస్థం న కుర్యాత్; అధికః=గుణాధిక కులాధిక వయోధికా ఇతి త్రివిధాధికేషు గుణాధిక ఏవ గ్రాహ్యః.తం నీచం = నీచపదస్థం న కుర్యాత్; అతః కారణాదర్హం = యథాతథాస్థాపయేత్, అన్యథాచే ద్రాజా నిన్దితో భవేత్.

టీ. కుమార=ఓరాజనందనా! స్వార్థతత్పరః, స్వార్థ=స్వప్రయోజనమందు,తత్పరః=ఆసక్తిగలిగిన, రాజా=రాజు,నీచం=నీచుని,గుణనీచుఁడు కులనీచుఁడు వయోనీచుఁడనినీచులఁడు మూఁడువిధములు; వీరిలో గుణనీచుఁడు వయోనీచుఁడు వర్జింపఁదగినవారు. వయోనీచుఁడన బాలుఁడనియభిప్రాయము; ఎనిమిదివత్సరముల పర్యంతము శిశువనియుఁ బదునాఱువత్సరములపర్యంతము బాలుఁడనియుఁ, పౌగండుఁడనియు నటుపైని స్వతంత్రుఁడు వ్యవహారజ్ఞుఁడనియు నెఱుంగునది, గానగుణనీచునివయోనీచుని అధికం=అధికోద్యోగినిగా, నకుర్యాత్ = చేయవలదు, అధికం = గుణాధికకులాధికవయోధికులలో గుణాధికుని, నీచం=స్వల్పోద్యోగినిగా, నకుర్యాత్ = చేయవలదు, అతః=ఆకారణమువలన, యథార్హం=ఎవనికి నేస్థానము తగునో యాప్రకారము, స్థాపయేత్=ప్రతిష్ఠింపవలయును; అననుకూలముగ నియోగించురాజు నిందితుండగు.

శ్లో. అన్తశ్శత్రుజయో యస్య, స బహిశ్శత్రుజిత్వరః
కుమార! పాలయే ద్రాజ్యం, ప్రకృతీ రనురఞ్జయన్. ౬౧.

గీ. ఎవని కంతరరిపుల జయింపఁగలుగు
నాతఁడే గద గడఁగి బాహ్యాభియాతి
జిత్వరుండయి ప్రజల రంజింపఁజేసి
కొనుచు రాజ్యంబుఁ బాలించుకొనుఁ గుమార! ౬౧.

వ్యా. అన్తరితి. హేకుమార! యస్య పురుషస్య అన్తశ్శత్రవః=కామక్రోధలోభమోహాదయ స్తేషాం జయః=పరాభవస్స్యా త్సపురుషః బాహ్యశత్రూణాం సర్వేషాం, జిత్వరః=జేతాసన్ ప్రకృతీః=రాజ్యాంగాని,అనురంజయన్ రాజ్యం పాలయేత్=

రక్షేదిత్యర్థః;అతో బహిశ్శత్రుజయా దన్తశ్శత్రుజయ ఏవ అవశ్యం కరణీయ ఇతి జ్ఞేయం.

టీ. కుమార=ఓరాజనందనా! యస్య=ఎవనికి, అంతశ్శత్రుజయః,అంతశ్శత్రు=అంతశ్శత్రులగు కామక్రోధాదులయొక్క, జయః=జయము, స్యాత్=అవునో, సః=అపురుషుఁడు, బహిశ్శత్రుజిత్వరః, బహిశ్శత్రు=బాహ్యశత్రువులయొక్క, జిత్వరః=జయముకలవాఁడై, ప్రకృతీః=రాజ్యాంగములను, అనురంజయన్,=రంజనచేయుచు, రాజ్యం=రాజ్యమును, పాలయేత్=పరిపాలింపవలయును ; అనఁగా బహిశ్శత్రుజయముకన్న నంతశ్శత్రుజయ మధికమని యెఱుంగునది.

శ్లో. తదా త్వ మాయతిం బుద్ధ్వా, సాందృష్టిక మతన్ద్రితః
కుమార! కార్య జాతం త్వ, మారభ స్వాత్తధీగుణః. ౬౨.

గీ. తంద్రపూనక నీవు త•త్కాలమాయ
తియును సాంద్రుష్టికమునను • ద్రివిధఫలము
దెలిసి కర్జంబులెల్ల సా•ధింపఁగఁడఁగు
మయ్య ధీగుణకలితుఁడ•వై కుమార! ౬౨.

వ్యా. తదాత్వమితి. హేకుమార! త్వం,ఆత్తాః=స్వాయత్తీకృతాః, ధియో గుణాః = శుశ్రూషాశ్రవణగ్రహణధారణోహాపోహార్థ విజ్ఞానతత్త్వజ్ఞాన రూపాః యస్య తథోక్త స్సన్, తదాత్వం=తత్కాలంచ, ఆయతిం=ఉత్తరకాలంచ, సాందృష్టికం = వర్తమానఫలం చ, బుద్ధ్వా=జ్ఞాత్వా, అతన్ద్రితః=న విద్యతే తన్ద్రా యస్య తథోక్తః అప్రమత్తస్సన్ కార్యజాతం=కార్య సమూహం, ఆరభస్వ. ని. "తత్కాలస్తు తదాత్వం స్యా దుత్తరః కాల ఆయతిః, సాందృష్టికం ఫలం సద్యః" ఇతి చామరః.

టీ. కుమార = ఓరాజనందనా, త్వం=నీవు, ఆత్తధీగుణః, ఆత్త=స్వీకరింపఁబడిన, ధీ=బుద్ధియొక్క, గుణః=శుశ్రూషాశ్రవణగ్రహణ ధారణాది గుణములుగలవాఁడవై, తదాత్వం=తత్కాలమును, ఆయతిం=ఉత్తరకాలమును, సాంద్రుష్టికం=వర్తమానకాలఫలమును, బుద్ధ్వా=తెలిసికొని, అతంద్రితః=ప్రమాదములేనివాఁడవై, కార్యజాతం=కార్యసమూహమును, ఆరభస్వ=ఆరంభింపుము.

